23.12.1994 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి : 66, సంచిక : 52, విడిప్రతి : రు. 2.00 లు

Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# మళ్లీ నలుగురు కొత్త మంత్రులు?

రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు మంత్రి వర్గాన్ని విస్తరించారు. దీంతో ఆయన మంత్రివర్గ సభ్యుల సంఖ్య 32కు చేరింది. ఎన్టీఆర్ లక్కీ నెంబర్ 9 వచ్చేందుకు వీలుగా త్వరలోనే మరో నలుగురిని మంత్రివర్గంలో చేర్చుకునే అవకాశముంది. మొదటి విడతగా ఎన్టీఆర్ తోపాటు మొత్తం 9 మంది ప్రమాణం స్వీకరించారు. రెండో విడత విస్తరణ మూడుసార్లు వాయిదా పడింది. ఎన్టీఆర్ అర్ధాంగి లక్ష్మీ పార్వతి, అల్లుళ్లు చంద్రబాబు నాయుడు, డాక్టర్ దగ్గుబాటి కీచులాటల కారణంగా విస్తరణ వాయిదా పడటం ఎన్టీఆర్ బలహీనతను బయట పెట్టింది. మొత్తం మీద అర్ధాంగి, అల్లుళ్ల

## కమ్మ వారందరికీ క్యాబినెట్ హోదా; హత్య కేసులో ముద్దాయికి హోం మంత్రిత్వం; నేరస్తులకు పెద్ద పీట వేశారు!




కోటాలతో ఎన్టీఆర్ మంత్రివర్గాన్ని విస్తరించి పార్టీలో తీవ్ర అసంతృప్తికి ఆజ్యం పోశారు. మంత్రుల ఎంపికలో సీనియారిటీ పాటించక పోవడం, అస్మదీయులను అందలం ఎక్కించి మిగతా వారికి అనామక శాఖలు

## ఉపన్యాసాలకు తప్ప పదవులకి అడపడుచులు పనికి రాలేదు!

కేటాయించడం, మంత్రివర్గంలో నేరగాళ్లకు పెద్దపీట వేయడం ఎన్టీఆర్ క్యాబినెట్‌లోని లోపాలు. కాగా తెలుగు ఆడపడుచు లంటూ వేదికలెక్కి ఘోషించిన రామారావు పేరుకు మాత్రం ప్రతిభా భారతికి మంత్రి పదవి ఇచ్చి చేతులు దులుపు కున్నారు. అలాగే మైనారిటీల తరఫున బాబూఖాన్ ఒక్కడికే. మంత్రి పదవి దక్కింది. కాగా హత్య కేసులో నిందితుడైన పి.ఇంద్రారెడ్డిని హోం మంత్రిని చేసిన ఘనత రామారావు గారు దక్కించుకొన్నారు. అలాగే హత్య కేసులో నేరాల్లో నిందితుడైన మాజీ నక్సలైటు పరిటాల రవికి నేరుగా క్యాబినెట్ హోదా కల్పించి కార్మిక శాఖను అప్పజెప్పారు. వంగవీటి మోహన రంగా హత్య కేసులో నిందితుడుగా పోలీసులకు లొంగిపోయిన 'ఘన' చరిత్ర కలిగిన దేవినేని నెహ్రూకు కూడా క్యాబినెట్ హోదా కల్పించి ఎన్టీఆర్ రికార్డు సృష్టించారు. రెండో పెళ్లి చేసుకొని మోసం చేశాడన్న ఆరోపణలకు గురైన తమ్మినేని సీతారామ్ కూడా మంత్రివర్గంలో చేరి పోయారు.

మంత్రివర్గంలో ఎన్టీఆర్ తోపాటు కమ్మ కులస్తులు ఏడుగురు వుండగా వారందరికీ క్యాబినెట్ హోదా లభించడం విశేషం. పది నెలల క్రితం పార్టీలో చేరిన పరిటాల రవి తొలిసారిగా శాసనసభకు ఎన్నికైనప్పటికీ అస్మదీయుడు కావటంతో క్యాబినెట్ దక్కిందన్న విమర్శ వుంది. నాలుగోసారి ఎమ్మెల్యేగా ఎన్నికైన సీనియర్ తమ్మినేని సీతారామ్‌కు మాత్రం సహాయ మంత్రి పదవేఇవ్వడం ఆశ్చర్యం. కాగా రెడ్డి కులస్తులు మొత్తం ఆరుగురికి మంత్రి పదవులుదక్కగా అందులో నలుగురు క్యాబినెట్, ఇరువురు సహాయ మంత్రులు వున్నారు. శాఖల కేటాయింపులో కూడా ఎన్టీఆర్ పక్షపాతంగా వ్యవహరించారని పార్టీ వర్గాలే విమర్శిస్తున్నాయి. అల్లుడు చంద్రబాబుకు రెవెన్యూ, ఫైనాన్స్, సహాయ పునరావాసం, ప్రణాళిక,




రిజిస్ట్రేషన్ శాఖలు కేటాయించి నెంబర్ టూగా పెద్దపీట వేశారు. తెలుగు దేశం ప్రధాన పథకం కిలో బియ్యం రెండు రూపాయల పథకాన్ని బుచ్చయ్య చౌదరికి ఇచ్చారు. చంద్రబాబు నాయుడుతో సరిపడని గాలి ముద్దు కృష్ణమ నాయుడికి నామమాత్రంగా ఉన్నత విద్యను మాత్రం కేటాయించారు. నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డికి తండ్రి శ్రీనివాసులు రెడ్డికి తొలిగా లభించిన చక్కెర శాఖను కేటాయించడం విశేషం.

### విస్తరణలో సిగపట్లు

మంత్రివర్గ విస్తరణ సందర్భంగా ఎన్టీఆర్ అర్ధాంగి, అల్లుళ్లు తమతమ కోటాలను డిమాండ్ చేయుటంతో విస్తరణ మూడుసార్లు వాయిదా పడింది. చిత్తూరు జిల్లా

## మంత్రిత్వాల్లో పెద్దల్లుడి మాటే చెల్లుబాటు - శాఖల్లో చిన్నల్లుడి పై చేయి!

నుంచి గాలి ముద్దు కృష్ణమ నాయుడ్ని మంత్రి వర్గంలోకి తీసుకోవాలని

కొరవ 6 పేజీలో

# చావు దెబ్బ తిన్నా బుద్ధి మాత్రం రాలేదు!

'ఎంత సరిచేసినా కుక్క తోక వంకరే' అన్నట్లుంది రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ పరిస్థితి. ఇటీవలి శాసనసభ ఎన్నికల్లో ఘోర పరాజయాన్ని చవిచూసినా రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల్లో ఎటువంటి పరివర్తన లేకపోగా, మునుపటి మాదిరిగానే పరస్పరం బురద చల్లుకునే కార్యక్రమంలో వున్నారు. ప్రస్తుత శాసనసభలో అరవై ఆరుమంది ఎమ్మెల్యేలున్న ఏకైక పెద్ద పార్టీగా చావుతప్పి కన్ను లొట్టపోయివున్న కాంగ్రెస్ పార్టీకి అసెంబ్లీలో ఎవరు నాయకుడిగా వ్యవహరించాలన్న దానిపై ప్రస్తుతం సిగపట్లు జరుగుతున్నాయి. సిఎల్పి నాయకుడికి క్యాబినెట్ ర్యాంకుతో ప్రతిపక్ష నాయకుడి హోదా లభించే అవకాశం లేనప్పటికీ ఈ పదవిని తమ గుప్పెట్లో పెట్టుకోవాలని డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి, కోట్ల విజయ భాస్కర రెడ్డి, నేదురుమల్లి వర్గీయులు ప్రయత్నిస్తున్నారు. మాజీమంత్రి డి.ఎల్. రవీంద్రారెడ్డిని కానీ, కోదండ రెడ్డిని కానీ సిఎల్పి నాయకుడ్ని చేయాలని వై.ఎస్. వర్గీయులు వ్యూహ

## ప్రతిపక్షం అర్హత లేని అధ్వాన్న స్థితి దాపురించినా కాంగ్రెస్ నాయకులు ముఠా కుమ్ములాటలు మానలేదు; ఇప్పటికీ తిట్టుకుంటూనే వున్నారు!

రచన చేస్తుండగా, మాజీమంత్రి గాదె వెంకట రెడ్డికి సిఎల్పి నాయకుడి పట్టం కట్టాలని కోట్ల విజయ భాస్కరరెడ్డి పట్టుదలతో వున్నారు. కాగా వై.ఎస్.ను వ్యతిరేకించే వారంతా నేదురుమల్లి వర్గీయుడైన పి.జనార్ధన రెడ్డిని సిఎల్పి నాయకుడ్ని చేయాలని కోరుతున్నారు.

సిఎల్పి నాయకుడి ఎన్నిక ఇంకా జరగలేదు. ఈ విషయమై భిన్నాభి ప్రాయాలుండటంతో బహుశా కేంద్రం నుంచి పరిశీలకుల్ని ఇక్కడకు దిగుమతి చేయవచ్చు. చట్ట ప్రకారంగా అయితే శాసనసభలో అత్యధిక సీట్లున్న పార్టీ నాయకుడు ప్రతిపక్ష నాయకుడిగా వుంటాడు. అయితే శాసనసభలో కనీసం 10శాతం స్థానాలు అంటే 30 స్థానాలుంటేనే కానీ ప్రతిపక్ష నాయకుడికి క్యాబినెట్ హోదా కల్పించరాదన్న సాంప్రదాయం వుంది. దీనిపై తుది నిర్ణయం తీసుకోవాల్సింది స్పీకర్. ఇంతవరకు స్పీకర్ ఎన్నిక జరగలేదు కాబట్టి సిఎల్పి నాయకునికి లెటు కారు దక్కుతుందో లేదో చెప్పడానికి మరికొంత సమయం పడుతుంది.

కొరవ 6 పేజీలో

# అభ్యర్థులే లేని అవమాన స్థితి

## గ్రూపులన్నీ ఒకటి కాకుంటే కాంగ్రెస్ అడ్రసు కూడా మిగలదు!

అసెంబ్లీ ఎన్నికలలో ఓటమి జిల్లాలో కాంగ్రెస వాదులను కకా వికలు చేసింది. ఆ షాక్ నుంచి వారు కోలుకోలేక పోతున్నారు. కొంబింగ్ రోజు కప్పిన ముసుగులు ఇప్పటికీ తీయలేకున్నారు. కష్టమే పాపం - ఐదేళ్ల పాటు అధికారమే తాముగా, తామే అధికారంగా తిరిగిన వారైతిరి; ఒక్కసారిగా అది పూరి పోవడంతో ఆ నిజం జీర్ణించు కోవడం వారికి చేత కావడం లేదు. "అధికారాంత మందు

### జిల్లాకాంగ్రెస్ దుర్గతి ఇదీ!

చూడవలె, ఆ అయ్య సౌభాగ్యముల్" అని పూరికే అనలేదు కదా పెద్దలు?

కానీ రాజకీయం వుంది చూశారు - అదొక వింత వ్యాధి. ఒకసారి దాన్ని వంట బట్టించు కున్నవాడు వదలించు కోలేడు. వదలించు కోబోతే వచ్చి అతుక్కుంటుంది. దురద పెట్టుంది. ఇప్పుడు కాంగ్రెస్ వాదుల పరిస్థితి అదే! ఓటమి పరాభావం సాకుతో కొంత కాలమైనా తప్పించుక తిరుగు దామనుకుంటే - పంచాయితీ ఎన్నికలు వచ్చేశాయి. అసెంబ్లీ ఎన్నికల్లో తిరిగిన తిరుగుడుతో వచ్చిన వళ్ళు నొప్పులు ఇంకా తగ్గలేదు. కాళ్ల వాపు తీయలేదు. తగిలిన పరాజయ అవమానపు దెబ్బలు మానలేదు. అప్పుడే మళ్లీ ప్రజల దగ్గరకు పోవలసిన దుర్గతి దాపురించింది. అప్పుడు ఓట్లతో మాత్రమే వావగొట్టారు ప్రజలు; ఇప్పుడు వెళ్తే ఇంక దేనితో కొడతారో తెలియదు. ఎవరిలోనూ ఉత్సాహం లేదు; ఎవరిలోనూ ఆశలేదు; ఎవరిలోనూ ఓపిక లేదు; ఎవరిలోనూ పూనిక లేదు. అంతా నిరామయంగా వుంది పరిస్థితి. అట్లనిచూస్తూ చూస్తూ పంచాయితీ రాజ్ సంస్థలను వదులు కోలేరు కదా? పై పెచ్చు పంచాయితీలు, మునిసిపాలిటీలను చేజిక్కించు కొంటే ఎమ్మెల్యేలను వట్టి ధ్రద్యులను చేసేయవచ్చు. అట్లా జరిగితే బాగుండన్న ఆశైతే అందరిలో వుందికాని, దాన్ని నెరవేర్చు కోగలమన్న విశ్వాసం ఎవరిలోనూ లేదు. నిన్న గాక మొన్న అంత ఉద్వేగంతో, ఉన్మాదంతో తెలుగుదేశాన్ని గెల్పించిన ప్రజలు, కాంగ్రెస్‌ను ఈసడించిన ఓటర్లు రెండు నెలల్లో మనసు మార్చు కుంటారా? అసంభవం. గెలుపుకు ఛాన్సు లేదని తెలుస్తూనే - పోటీకి సిద్ధ పడడం మూర్ఖత్వం కాదా?

ఈ డోలాయమాన స్థితే, ఈ రోజు జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి అభ్యర్థులు దొరకని దౌర్భాగ్య స్థితిని కల్గిస్తున్నది. అసెంబ్లీ ఎన్నికల సమయంలో కాంగ్రెస్ టికెట్ లభించడమే అదృష్టంగా భావించిన వారు, ఇప్పుడు పిల్చి ఇస్తామన్నా బెట్టు చూపించేట్లున్నారు. నిజానికిది బెట్టు కూడా కాదు - భయం!!

ఇప్పటికైనా కాంగ్రెస్‌లోని వివిధ గ్రూపులు ఏకమై, నాయకులంతా కలసి పనిచేస్తే ఎన్నికలకు ఇంత భయపడ వలసిన పని లేదు. సమష్టిగా పని చేస్తే సగం మండలలో కాంగ్రెస్‌దే గెలుపౌతుంది! గ్రామాలలో ఇప్పటికీ కాంగ్రెస్‌కు కార్యకర్తలు, అభిమానులు వున్నారు. వారి నందరినీ ఉత్సాహ పరచి, కార్యోన్ముఖులను చేయడానికి పటుత్వం కల్గిన నాయకత్వం కావాలి! ముక్కలు ముక్కలుగా చీలి పోయిన జిల్లా కాంగ్రెస్‌లో ఎవరు స్వీకరిస్తారు ఆ బాధ్యత?

### పంచాయితీ, మునిసిపల్ ఎన్నికలలో పలు స్థానాల్లో కాంగ్రెస్ తరఫున పోటీ చేయడానికి ఎవరూ ముందుకు రావడం లేదు; జిల్లా పరిషత్‌కు సిద్ధమయ్యే నాయకుడిని కాగడా వేసి వెతకాల్సిందే!

జనార్ధన రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి, ఆనం వర్గాలు ఏకమైతే; ఒక్క మాటతో, ఒక్క బాటలో నడవ గల్గితేనే అది సాధ్యం. కలతలు మర్చిపోయి, కలహాలు మాని సమష్టిగా పని చేసేందుకు వీరందరూ ముందుకు వస్తేనే కాంగ్రెస్‌కు భవిష్యత్, లేకుంటే, ఈ ఎన్నికలలోనూ పేచీలు పెట్టుకొని ప్రవర్తిస్తే కాంగ్రెస్ అడ్రసు కూడా మిగలదు.

జిల్లా, టౌన్ కాంగ్రెస్ కమిటీలను, యూత్ కాంగ్రెస్ సంసను సమర్థులు, సమన్వయంతో పని చేసే వారితో పునర్వ్యవ స్థీకరించడం అవసరం. ఆనం సంజీవ రెడ్డి గారు ఒక వర్గానికి, అందులోనూ చీలిక భాగానికి పరిమితమై పోయారు. ఆయన సారథ్యంలో పంచాయితీ ఎన్నికలకు పార్టీని నడపడం అసాధ్యం. ఆయన తనంతట తానుగా ఆ పదవి నుంచి తప్పుకోవలసిన సమయం ఆసన్నమైంది. వివాద రహితుడంటూ ఎవరూ దొరకరు గాని, కనీసం పార్టీ పనికి పూర్తి సమయం వెచ్చించ గల, అందరితోనూ సంప్రదించడానికి సమస్యలు లేని వ్యక్తిని వెతికి ఆ పదవిలో కూర్చోబెట్టడం అవసరం. నిత్యోత్సాహంతో, ప్రతిపక్షం పాత్రను నిర్వహించ గల్గిన యువకుడిని వెతక గల్గితే మరీ మంచిది. అటువంటి అరుదైన జాతిని ఏ అడవి నుంచి తేగల రంటారా? ఏమో మాకేమి తెలుసు?

మండలాలు సరే - గంతకు తగ్గ బొంత ఎవరో ఒకరు దొరక కుండా పోరు; కాని జిల్లా పరిషత్ సంగతి? పెద్ద ప్రశ్న అదే. అసలు నెల్లూరు రిజర్వుడు అవుతుందా? లేక జనరల్‌గా మిగులుతుందా? రిజర్వుడైతే బిసినా? ఎస్సినా? ఎస్టినా? పోయిన సారి జనరల్ కాబట్టి, రిజర్వు చేసే అవకాశమూ వుంది. ఒకవేళ జనరల్ అయితే కాంగ్రెస్ అభ్యర్థిగా

కొరవ 6 పేజీలో

## డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి మనసు పొరల్లో విప్పారిన కవితా కుసుమాలు!

డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డిగారి వంటి సాహిత్యా రాధకులు నూటికో కోటికో ఒక్కరుంటారు. రాజకీయ నాయకులు, పరిపాలనా దక్షులు సాహిత్య సేవ చేయబూనడం చాలా అరుదుగా సంభవిస్తుంది. దేశ సేవ, సమాజసేవ, సాహిత్యసేవ జీవితాశయంగా పెట్టుకున్న మహనీయులు డాక్టర్. గోపాలరెడ్డి.

డాక్టర్ గోపాలరెడ్డిగారు పదవి విరమణ చేయడమంటే హాయిగా విశ్రాంతి తీసుకోవడం అని భావించిన వారుకారు. అనేక ఉన్నత పదవులను అలంకరించి ఆయన నెల్లూరికి రావడంవల్ల అక్కడి సాహిత్య వాతావరణం బలపడింది. 1978 నుంచి కవిగా గోపాలరెడ్డి గారు ప్రచురిస్తున్న పుస్తకాలు ఆయనకు సాహిత్యం పట్ల ఉన్న నిరంతర ప్రేమను వ్యక్తం చేస్తున్నాయి. డెబ్బయ్ ఏళ్ల తర్వాత వరుసగా 21 కవితా సంకలనాలు ప్రచురించిన త్రివిక్రముడు డా.గోపాలరెడ్డి. అలా చేసిన సాహిత్యా రాధకులు మరెవరైనా ఉన్నారా అని ఆశ్చర్యం వేస్తుంది.

'స్వరవల్లరి' డా. బెజవాడ గోపాల రెడ్డి గారు ప్రచురించిన ముక్తక గ్రంథం. ఇది ముక్తకాల పదో పుస్తకం, కవితా సంకలనాలలో ఇరవై రెండవది. ఈ పుస్తకంలో మూడు భాగాలున్నాయి. మొదటి ఏడు కవితల్ని 'స, రి, గ, మ, ప, ద, ని' అన్నారు. దీన్ని వేదాంతంతో మొదలు పెట్టి, అభినేత్రితో ముగించారు. ఈ విద్యూరాన్ని గూర్చి కవిగారే 'బతుకు అట్టి విద్యూరాల కుప్ప గాదా' అన్నారు. 'స్వరవల్లరి' రెండో భాగంలో 167 ముక్తకాలున్నాయి. మూడవ భాగంలో బెగోర చేసిన నూతన ప్రయోగాలు కనిపిస్తాయి.

> **గ్రంథసమీక్ష**
> స్వరవల్లరి
> రచయిత
> డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి
> సమీక్షకుడు
> డాక్టర్ ఆర్వీ.యస్.సుందరం
> ప్రతులకు
> విశాలాంధ్రబుక్‌హౌస్
> విజయవాడ
> వెల :రు. 25/-

'స్వరవల్లరి' గోపాలరెడ్డి గారి పరిణత హృదయాన్ని, పండిన అనుభవాన్ని చాటి చెప్పే సంకలనం. "చింపాల్సిన కేలండరు కాగితాలు ముందు ఎక్కువ లేవు" అంటూనే జీవితాన్ని సార్థకంగా గడపాలని భావించే కర్మయోగి బెగోర. అంతేకాదు. ఆయన ముందుచూపు యువతరానికి మార్గదర్శకం. "ప్రగ్గద, లయ గ్రాహులలో కవిత్వం వ్రాయవద్దు"ని ఉచితంగా సలహా ఇస్తారాయన. "స్వేచ్ఛగా అనిబద్ధంగా సస్యసేల పుష్పించే కవితలు వ్రాయండి" అంటారు. "నా విరామ ఫలకముపై 'ఏవో కొన్ని గీతలు గీసుకొంటున్నాను' అవి బొమ్మలో, కలలో, ఎండమావులో" అన్నప్పుడు కవిగా ఆయన వినమ్రత్వం స్పష్టమవుతుంది. కవిగా బెగోర ఆశయం మహత్తరమైంది. "కళానందములో చిరంజీవములై భావితరముల ఉత్సాహ పరచే" కావ్య సంపదలను ఆయన కోరుకుంటారు.

డా. గోపాలరెడ్డి గారి మనసు పొరలు విప్పారి కవితా కుసుమాలై ఈ సంకలనంలో చాలాచోట్ల సాక్షాత్కరిస్తాయి. "చావు లేకుంటే జీవితము మోస్తూనే వుండాలి. నడుస్తూనే వుండాలి. విసుగు పుట్టించే పరిణామము" అనడంలో కవి పరిణత బుద్ధి తెలుస్తుంది. "సమన్వయం చేస్తూ పోతాను, సంప్రదాయ సముద్ర స్నానాలు చూస్తాను, ఆధునిక శిఖరా రోహణలను చూస్తాను" అంటారు ఈ సమన్వయ కవి.

నూతన దృశ్యాలలో గోపాల రెడ్డిగారు చెప్పిన మాటలు ఆయన అంతరంగానికి అద్దం పట్టాయి.

1. దీపము ఎప్పుడో దాగింది -
వెలుతురు వ్యాపిస్తూ కనబడుతూంది
2. శిల్పి ఎప్పుడో మాయమైనాడు
శిల్పము శతాబ్దముల తర్వాత
అందముగా నిలిచియున్నది.

## మరణంకోసం ప్రార్థన!

-చిన్ని నారాయణరావు.

వేయికోట్లు కావాలట
వేయిపడగల విషసర్పం
వీరప్పన్ మహాశయుడికి!
క్రూరత్వం...
కర్కశత్వం...
రాక్షసత్వం...
ఇవన్నీ చిన్న చిన్న
పదాలై నిలుస్తాయి
అతని నిర్వాకాలకి!
ఎన్ని ఏనుగులు నేలకొరిగాయి
ఆ దాహార్తికి...
ఎంత అటవీ సంపద
ఆహుతి అయ్యిందో
తరగని ఆకాంక్షకి!
అనునిత్యం మారణహోమాల్తో
మానవతనే మంటల్లో
తగులబెట్టె వీరప్పన్...
ఆ నరహంతకు-
[illegible] కేవలం ధనం
[illegible] సోదరజనం
ఇదెక్కడి 'వీర'త్వం!'
మనిషిగా అతని పుట్టుకే విచిత్రం!
నిరంతర రక్తాస్వాదం
పిశాచరుడి అభిమతం
నిప్పటి చరిత్ర
నేటి వర్తమానాలపై
ఆ బ్రతుకు ఓ ప్రశ్నార్థకం?
అవనీతలంపై అతని పాత్ర
అత్యంత కిరాతకం
ఆగని ఆదాహం చల్లారడానికి
కోట్లమంది కడతేరక తప్పదు
వీరప్పన్ మరణం కోసం
ప్రార్థించడమే ఈ [illegible]లో
శరణ్యం
అదే జీవన మంత్రం!
వీరప్పన్
కన్నుమూత...
మానవతను పిగుల్చు
కోట్లమందిని రక్షించు
[illegible]కోట్ల తప్పను ఇచ్చు!

# పివికిఎందుకంత భయం?

అవినీతి పరులుగా ముద్రపడి, విచారణా సంఘాలు నిర్ధారించిన పలువురు కేంద్ర మంత్రులపై చర్య తీసుకొనే విషయంలో ప్రధాని శ్రీ పివి నరసింహారావు అనుసరిస్తున్న వైఖరి హేయంగా వుంది. పదవులను అడ్డం పెట్టుకొని ప్రజాధనాన్ని తెగమెక్కిన ప్రబుద్ధులను కాపాడడానికి ప్రధాని స్థాయిలో ఆయన చేస్తున్న ప్రయత్నాలు చాలా అభ్యంతరకరంగా వున్నాయి.

షేర్లమార్కెట్ కుంభకోణానికి కీలక పాత్రధారి, 4వేల కోట్ల రూపాయలకు పైగా స్వాహా చేసిన దేశద్రోహి హర్షద్ మెహతాతో చేయి కలిపిన కేంద్ర మంత్రులు శంకరానంద్, రామేశ్వర్ ఠాకూర్‌లను జాయింట్ పార్లమెంటరీ విచారణ సంఘం దోషులుగా నిర్ధారించింది. శంకరానంద్ తన అదుపులోని వందలాది కోట్ల రూపాయల ఆయిల్ నిధులను దొడ్డిదారిన హర్షద్ మెహతాకు చేరేటట్లు చూస్తే; రామేశ్వర్ ఠాకూర్ హర్షద్ మెహతాపై ఇన్‌కంటాక్స్ ప్రతిపాదించిన చర్యలను నిలిపివేసి స్కాం స్వాహాలో తమ వంతు భాగం పంచుకున్నారు. జెపిసి నివేదిక వెల్లడై ఏడాది దాటింది. పార్లమెంట్‌లో పలుమార్లు రచ్చ రేగింది. కాని పివి వారిద్దరిపైనా కనీసపాటి చర్యతీసుకునేందుకు సాహసించలేక పోతున్నారు.

చక్కెర కుంభకోణంలో కల్పనాథరాయ్ మరీ నిస్సిగ్గుగా వ్యవహరించారు. చక్కెర సరఫరాకు ఏర్పడ బోతున్న కొరతను అధికారులు తెలియజేసినా ఫైళ్లు త్రొక్కిపెట్టి; దిగుమతులను కావాలని ఆలస్యం చేసి, చక్కెర ఫ్యాక్టరీలు, వ్యాపారులు వందలాది కోట్ల రూపాయలు ఆర్జించుకొనేందుకు ప్రత్యక్షంగా సహకరించారు కల్పనాథరాయ్. జ్ఞాన ప్రకాష్ కమిటీ విచారణలో ఆయన అవినీతి భాగోతం సందేహాతీతంగా రుజువైంది. అయినా పివి అతడిపై చర్య తీసుకొనేందుకు సందేహిస్తున్నాడు. తటపటాయించడమే కాదు, పార్లమెంట్‌లో బాహాటంగా ఈ ముగ్గురు మంత్రులను సమర్థించి, లజ్జా రహితంగా వ్యవహరించారు ప్రధాని.

స్కాంలో ప్రధాన భాగస్వామి అయిన హితేన్ దయాల్ నుంచి తన కుమారుడి ప్రమేయం వున్న గోల్డ్‌స్టార్ కంపెనీకి రెండు కోట్ల నిధులు అందిన విషయంలోనూ పివి ప్రవర్తన పలు అనుమానాలకు దారి తీస్తున్నది. సిబిఐ నేర నిర్ధారణ చేసిన తర్వాత కూడా, వ్యవహారం ఆ కంపెనీ అధిపతుల వ్యక్తిగత అప్పుకు సంబంధించినదని తేలికగా తీసి పారేశారు ప్రధాని.

రెండు దక్షిణాది రాష్ట్రాలలో కాంగ్రెస్ పార్టీని ప్రజలు అత్యంత అవమానకర తీరులో ఓడించిన తర్వాత కూడా ప్రధానమంత్రి, తన క్యాబినెట్‌లోని అవినీతి పరులను, తన కుటుంబ సభ్యులను రక్షించడానికి ప్రయత్నించడం బాధాకరమైన విషయం. శ్రీ పివి నరసింహారావు వ్యక్తిగత జీవితంపై ఎవరికీ ఎటువంటి సందేహాలు లేవు. కాని, ఆ స్వచ్ఛత, ఆ నిష్కళంకత్వం ప్రజలు విశ్వసించాలంటే ఆయన ప్రభుత్వం, పరిపాలనలు కూడా మచ్చలేనివిగా వుండాలి. కాని, పివి నరసింహారావుగారు ఆ విషయంలో తగిన శ్రద్ధ తీసుకోవడంలేదు. తన మంత్రి వర్గంలోని సభ్యులు అవినీతి పరులని, దేశద్రోహంతో సమానమైన స్కాం కుంభకోణం, చక్కెర, గోల్మాల్‌లలో భాగస్వాములని తేలిన తర్వాత కూడా వారిని రక్షించడానికి ప్రయత్నిస్తుంటే, మంత్రివర్గం నుంచి కూడా తొలగించకుండా కొనసాగిస్తుంటే ప్రజలు సహిస్తారా? ఆయన ప్రభుత్వం నీతిమంతమైనదని విశ్వసిస్తారా? ప్రజలలో ఒకసారి విశ్వాసం పోయిన తర్వాత ఆ ప్రభుత్వం మనుగడలో అర్థం వుంటుందా?

అసలు ఈ అవినీతి పరులను రక్షించడానికి పివి ఎందుకు ప్రయత్నిస్తున్నారు? కల్పనాథ రాయ్ సవాల్ చేస్తున్న తీరులో ప్రకటనలు చేస్తుంటే ఎందుకు భయ పడుతున్నారు? ఆయన పిరికి తనానికి కారణమేమిటి?

కారణాలేమైనా ప్రధాని ఇప్పటికైనా తను, తన మంత్రి వర్గం అవినీతిమయం కాలేదని ప్రజలకు నిరూపించు కోవలసిన అవసరం వుంది. ఆయన ఆ కృషిలో విఫలమైతే, ఏడాదిన్నరలో జరగవలసి వున్న పార్లమెంట్ ఎన్నికలలో ప్రజలు ఏ రూపంలో ప్రతి స్పందిస్తారో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఇప్పటికే ఆంధ్ర, కర్నాటక, ఉత్తర ప్రదేశ్, బీహార్, గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రాలలో కాంగ్రెస్ పార్టీ తుడిచి పెట్టుకొని పోయివుంది. ప్రవర్తన మారకుంటే ఢిల్లీ లోనూ అడ్రసు లేకుండా పోతుంది.

కేవలం కాంగ్రెస్ పార్టీ భవిష్యత్ దృష్ట్యానే కాకుండా ప్రజాస్వామ్య సాంప్రదాయాలు, దేశ ప్రతిష్ఠల కోసమైనా పివి నరసింహారావు గారు అవినీతి పరులైన మంత్రులను పదవుల నుంచి తొలగించాలి. వారిపై చట్ట ప్రకారం చర్య తీసుకోవాలి. స్కాంలో దోషులైన వారిని కఠినంగా శిక్షించాలి. అది చేయలేనప్పుడు, ఆర్థిక సంస్కరణల ద్వారా ఆయన సాధించిన కీర్తి ప్రతిష్ఠలు మట్టిలో కలిసిపోయి, ప్రజల దృష్టిలో చులకనైపోతారు.

జమీన్‌రైతు

---

## జమీన్‌రైతు

22-12-1944

పేజీలు:10 వెల: 0-1-6

**50 ఏళ్లక్రితం ఈవారం**

### ఒకేరోజు 801 పెళ్లిళ్లు!

భార్యలున్న వుద్యోగులకు జీతంతో సహా, అలవెన్సులు యెక్కువ చేస్తాం అని హైదరాబాదు ప్రభుత్వం యిటీవల ఒక ప్రకటన చేసింది. దాంతో నైజాం ప్రభుత్వ వుద్యోగులంతా పెళ్లిళ్లు చేసుకోవటానికి పూనుకున్నారు.

ఈనెల ఒక్క 14 తేదిన మాత్రమే 801 పెళ్లిళ్లు జరిగాయి. ఇలాంటి వుదంతం నైజాంలో ఎప్పుడూ జరగ లేదంటున్నారు. కాని బ్రిటిష్ ఇండియాకు శారదా బిల్లు లగ్నం మరుపురానిదే.

### నెల్లూరు ముచ్చట్లు
### పడవ ప్రమాదం

ఈ మధ్య జరిగిన పడవ ప్రమాదాన్ని గూర్చి నెల్లూరు డిప్టీ కలెక్టరు బహిరంగ విచారణ జరిపారు. రామానాయుడు కూడా 18 తేది యీ క్రింది స్టేటుమెంటు ఇచ్చారు.

పడవలు చాలా అలందరంగా వున్నవనీ ఎక్కువ మందిని ఎక్కిస్తున్నారనీ, వాటిమీద కంట్రోలే లేదనీ పడవవాండ్రు తప్పత్రాగి పడవలు నడుపుతుంటారనీ. చేతగాని వాళ్లచేత కూడా పడవలు నడిపిస్తుంటారనీ. నెల్లూరు టవునుకు కావలసిన పాలు, పెరుగు, కూరగాయలు, వగయిరా సప్లయిలన్నీ కోవూరు తాలూకా నుండి వస్తవనీ, ఈ దువల్ల గూడా రాకపోకలు వస్తవనీ, ఆనకట్ట మీద గూడా చాలా ప్రమాదాలు జరుగు చున్నవనీ, పోలీసు బందోబస్తేమీ వుండడం లేదనీ, కావున పడవలు జిల్లా బోర్డు కంట్రోలులో వుంచి, పోలీసు బందోబస్తు, చెకింగు వుండాలనీ, రైల్వే బ్రిడ్జి మీద ఒక ప్రక్క నడుచుటకు వంతెన వేయు ప్రయత్నం యిదివరకు జిల్లా బోర్డు, రైల్వే కంపెనీల మధ్య జరిగి వుండినది. దాన్ని వేయించమనీ, ఉదయం బిట్రగుంట నుండి ఉత్తరంగా బైలుదేరి సాయంత్రము బిట్రగుంట వరకే వచ్చి నిల్చిపోతున్న ట్రెయినును గూడూరు వరకు పొడిగించమనీ, మరియు ఏటికి నీరు వచ్చినపుడు నెల్లూర్లో ఒకటి, పడుగుపాటిలో ఒకటి బోగీ క్యారేజీలు వుంచి, ఆ దిక్కు నుండి ఆ దిక్కుకు పొయ్యే మెయిలు, యక్స్‌ప్రెస్, ప్యాసింజరు, గూడ్సు అన్ని బండ్లకు దాన్ని తగిలించి అది పడుగుపాటిలో వదిలిపెట్టి పొయ్యేట్లున్నూ, అట్లనే ఆ దిక్కు నుండి వచ్చే బండ్లకు గూడా ఆ విధంగానే చేస్తే యే ఖర్చులు లేకుండానే ప్రయాణీకులను సులభంగా దాటవేయ వచ్చునని స్టేటుమెంటులో చెప్పారు.

---

# మంచితనమే యానాదిరెడ్డిని మళ్లీ ఎమ్మెల్యేగా గెల్పించింది!

**జనవాణి**

ఎన్నికల ముందు జమీన్‌రైతులో కాంగ్రెస్ పార్టీ ఎన్నికల పరిస్థితిని గురించి చక్కటి రాజకీయ వార్తలు వ్రాసినందుకు ముందుగా ధన్యవాదాలు. ఈ కుటుంబం స్వాతంత్ర్యం రాక ముందునుండి కాంగ్రెస్ పక్షమే. నేను కావలి వచ్చిన తర్వాత నుంచి ఎప్పుడూ చూసినా నాయకునిగా యానాదిరెడ్డి ఎదురులేదు. ఆయన కష్ట సమయాల్లో సైతం జనార్ధనరెడ్డి వలె ఇందిరాగాంధీని వెన్నంటే వున్నారు. మొన్న అసెంబ్లీ ఎన్నికల్లో యానాదిరెడ్డి విజయంపై మాకు అనుమానం లేకున్నా పెద్ద రెడ్లు విడిచి వెళ్లడంపై మీరు అనుమానం వ్యక్తం చేశారు. కాని మంచితనమే ఆయనకు విజేతను చేసింది. జనార్ధనరెడ్డి బంధువర్గ వల్ల యానాదిరెడ్డికి నష్టమే జరిగింది. కాని వారిపట్ల ఆయన చూపిన విశాలత ఏమిటో అర్థం కావడంలేదు. ఏది ఏమైనా ఈ సైకిల్ తుఫాన్‌లో మీరన్నట్లు గజకర్ణ, గోకర్ణ విద్యలను ప్రదర్శించి యానాదిరెడ్డి గెలిచారు. ఇప్పుడూ కావలిలో ఆయనకు చెల్లుతీయాలని ప్రయత్నిస్తున్నారు. కాని శివుడు యానాదిరెడ్డిని మాత్రం నిత్యం కాపాడు తుంటాడు.

కావలి -డాక్టర్. డి.వెంకట్రామయ్య.

### బస్సు నేమ్‌బోర్డులకు లైట్లు ఎయండి!

జిల్లాలో గ్రామీణ ప్రాంతాలకు పంపే ఎక్కువ ఆర్టీసి బస్సుల నేమ్‌బోర్డులు అత్యంత దయనీయంగా వున్నాయి. వీటిని సరిగా వ్రాసి వుంచరు. దగ్గరకు వెళితేగాని కనపడవు. రాత్రిపూట అయితే ప్రయాణీకులు పడే అవస్థ వర్ణనాతీతం. నేమ్ బోర్డుల లైట్లు వెలగవు. ఎక్కడకు బస్సులు పోతున్నాయో తెలియక ప్రజలు తికమక పడాలి. వీటి విషయమై ఆర్టీసి యాజమాన్యం పట్టీ పట్టనట్లు వ్యవహరించడం క్షమించరాని

కొరవ 8 పేజీలో

# ప్రపంచానికి వ్యవసాయం నేర్పింది భారతదేశమే!

## కానీ దిగుబడిలో ప్రపంచానికంతా హీనంగా వున్నదీ భారతదేశమే!

గత ఏడాది డిసెంబరులో వి.ఆర్. కళాశాలలో ప్రారంభించిన సైన్సు సెంటరు 17తేది తొలిసారిగా వ్యవసాయంపై సెమినార్ నిర్వహించింది. కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ పి.గోపాల కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో భూసార పరీక్షా కేంద్రం డిప్యూటీ డైరెక్టర్ పి.ఎస్.వి. ప్రసాదరావు ప్రధాన వక్తగా విచ్చేశారు. ఇతర దేశాలకు వ్యవసాయాన్ని నేర్పింది భారతదేశమే; అయితే ప్రస్తుతం చైనాలో ఎకరానికి 80 బస్తాల ధాన్యం పండిస్తుండగా మనదేశంలో 40 బస్తాల ధాన్యం మాత్రమే పండు తుందన్నారాయన. ఆధునాతనమైన పద్ధతుల ద్వారా వ్యవసాయాన్ని చేస్తే ఎక్కువ ఫలసాయం పొందవచ్చు. అందుకోసమే ప్రతి జిల్లాలో భూసార పరీక్షా కేంద్రాలు ఏర్పాటు చేసి వున్నట్లు చెప్పారు. పంట వేసే ముందు నాలుగు చేట్లనుంచి మట్టిని శాంపిల్ తీసుకొని భూసార పరీక్షా కేంద్రానికి పంపితే మట్టి సారాన్ని నిర్ణయించి రైతులకు తగిన సలహాలను, వాడవలసిన ఆమ్లాలు, క్షారాలు, ఎరువుల వివరాలు తెలియ జేస్తామన్నారు. సైన్సు సెంటర్ ఆర్గనైజింగ్ సెక్రటరి బి.సుధాకర్, ఉపాధ్యక్షుడు ఎ. వేణుమాధవ్, బోటనీ డిపార్టుమెంట్ ఇన్‌ఛార్జ్ సి.ఎల్. నరసింహారావు, అధిక సంఖ్యలో విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఆర్టీసీ రిజర్వేషన్ ఫోన్‌ద్వారా చేసుకోవచ్చు

నెల్లూరు నుండి దూర ప్రాంతాలకు వెళ్లే ప్రయాణీకులకు

**నెల్లూరు సంగతులు**

టెలిఫోన్ ద్వారాఅడ్వాన్సు రిజర్వేషన్ చేసుకొనే అవకాశాన్ని ఆర్టీసి బస్ స్టేషన్‌లో కల్పించారు. హైదరాబాద్, బెంగుళూరు, కర్నూలు, గుంతకల్, కళ్యాణదుర్గం, ధర్మవరం, పుట్టపర్తి ప్రాంతాలకు ఈ సౌకర్యం వుంటుంది. 26202 ఫోను చేసి ఏ సమయం లోనైనా రిజర్వేషన్ పొందవచ్చు. సౌకర్యానికి సర్వీసు ఛార్జిగా టిక్కెట్టు తోపాటు మరో మూడు రూపాయలు వసూలు చేస్తారని ఆర్టీసి ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ జి. ప్రభాకర గుప్త చెప్పారు.

### పాఠకుల్లో చైతన్యం తెచ్చే రచనలు రావాలి!

న్యూ అనిల్ బుక్ సెంటర్ అయిదో పుస్తక మహోత్సవాన్ని దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో ఏర్పాటు చేసింది. ఎస్.వి. యూనివర్శిటీ ప్రొఫెసర్ సి. రాజారావు ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. పెద్ద పట్టణాలకే పరిమితమైన పుస్తక ప్రదర్శనలు, జిల్లా స్థాయి, మండల స్థాయికి విస్తరింప జేస్తున్న అనిల్ బుక్ సెంటర్ అధినేతను అభినందించారు. పుస్తక ప్రదర్శనల వల్ల లభించే జ్ఞానం సమాజ చైతన్యానికి, సాంఘిక సమైక్యతకు వుపయోగ పడుతుందన్నారు. సినిమాల లాగా పుస్తక రచనపై సెన్సార్ బెడద లేనందువల్ల యువ రచయితలు సమాజానికి కావల్సిన రచనలు చేసి పాఠకులను చైతన్య వంతుల్ని చేయాలన్నారు. కార్యక్రమానికి జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మెన్ మెట్టా చంద్రశేఖర్ రెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టర్ జగదీష్, లెక్చరర్ టి.సుధాకర రెడ్డి, దొడ్ల పద్మావతమ్మ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అతిథులను అనిల్ బుక్స్ అధినేత వి.వాసు మెమెంటోలతో

కొరవ 8 పేజీలో



## శెభాష్ గుడ్డు

### * రామారావు గారూ, కనీస సంసార పక్షం పాటించి, సరసాలాడండి!

వ్యక్తుల ప్రైవేటు జీవితాలు వారి స్వంతం. వారు త్రాగినా, తిరిగినా, జూదమాడినా, ఏ పనిచేసినా - వాటివల్ల సమాజానికి కష్టము, నష్టము కల్గనంత కాలం ఎవరూ నోరెత్తి మాట్లాడ నవసరం లేదు.

కానీ అదే వ్యక్తి పబ్లిక్‌లోకి వస్తే - ఎవరైనా, ఏమైనా అంటారు. అనమని శ్రీశ్రీ ఎప్పుడో చెప్పాడు. పబ్లిక్‌లో వుండే వ్యక్తి ప్రతి కదలిక చర్చింప దగినదే, ప్రశ్నింప దగినదే; ప్రతి మాటా విశ్లేషింప దగినదే, విమర్శకు అర్హమైనదే!

ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు, ఆయన (అ)ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీపార్వతిల ప్రణయ కలాపాలు మరీ ఎబ్బెట్టుగా, జుగుప్సాకరంగా, లజ్జారహితంగా వుంటున్నాయి. ఎన్నికల ముందు వారిద్దరూ చైతన్య రథమెక్కి చిలకలూరి పేట రికార్డ్ డ్యాన్స్ ట్రూపువలె రాష్ట్రమంతా తిరిగారు. జనానికి ఆ ప్రదర్శనలు భలే బాగా నచ్చాయి; ఓట్లు వేశారు; గెల్పించారు. అంతవరకు బాగానే వుంది. కానీ, అధికారంలోకి వచ్చిన తర్వాత, ముఖ్యమంత్రి పదవి నధిష్టించిన తర్వాత కూడా వీరిద్దరూ పబ్లిక్‌గా సరస సల్లాపా లాడడమే అవమాన కరంగా వుంది. రాష్ట్రపతి భవనం, సెక్రెటేరియట్ గదులు, బహిరంగ వేదికలు, పడక టిల్లులకు మధ్య వారికి తేడా తెలియడం లేదు. కృతజ్ఞతలు చెప్పడాని కంటూ ఎన్టీఆర్ రాష్ట్రపతి దగ్గరకు వెళ్లినపుడు, అంత పెద్ద గౌరవనీయులైన వ్యక్తి, రెండు చేతులెత్తి నమస్కారం పెడుతుంటే రామారావు గారు లక్ష్మీపార్వతి భుజం పైన చేయివేసి, హనీమూన్ టూర్‌లోని కొత్త జంటవలె అతుక్కొని నిలబడి ఆమెను దగ్గరకు లాక్కుని చిద్విలాసం చేయడం పత్రికల్లో చూసినపుడు 'ఛీ' అన్పించింది. ధర్మ సమ్మతంగా పెండ్లి చేసుకున్న దంపతులు కూడా తెలుగు సంస్కృతిని పాటించే వారైతే, పదిమంది ఎదుట వున్నప్పుడు ఒకరి నొకరు తాకడానికే సందేహిస్తారు. ఏ సంసార పక్షపు తెలుగు మహిళ కూడా ఇటువంటి వెకిలి చేష్టలు సహించదు. రాష్ట్రపతి అంటే దేశాధినేత. ప్రతి భారతీయ పౌరుడూ గౌరవించి తీరవలసిన నాయకు డాయన. అందులోనూ శంకర్ దయాళ్ శర్మ

**డోలేంద్ర**

వ్యక్తిగతంగా కూడా పూజనీయుడు; అన్నేళ్లు ప్రజా జీవితంలో వుండి వివాద మన్నది ఎరుగని, విమర్శ అన్నది ఎదుర్కొని సత్పురుషుడు; మహా మేధావి. అత్యున్నత పదవిలో వున్న అటువంటి అత్యుత్తమ పురుషుడి పట్ల ప్రవర్తించ వలసిన తీరు ఇదేనా? రాష్ట్ర ప్రజలందరూ సిగ్గు పడాల్సిన విషయమిది.

సెక్రెటేరియట్‌కు ఎన్టీఆర్‌కు మధ్యాహ్న భోజనం తీసుక వెళ్లడమనే ప్రహసనానికి లక్ష్మీపార్వతి కల్పిస్తున్న ప్రచారం కూడా ఎబ్బెట్టుగా వుంది. సినిమాల్లో చూస్తుంటాం ఇటువంటి సన్నివేశాలు. ముఖ్యమంత్రి పదవిలో వుండే వారికి మధ్యాహ్న భోజనం పెద్ద

కొరవ 6 పేజీలో

# "టౌన్‌లో అభివృద్ధి రథానికి ఎదురన్నది లేకుండా చేస్తా!"

19 తేది స్టోన్‌హౌస్ పేటలోని పప్పుల వీధిలో ఎమ్మెల్యేగా ఎన్నికైన శ్రీ టి. రమేష్ రెడ్డికి అభినందన సభ జరిగింది. అట్టహాసంగా ఆత్మకూరు బస్టాండ్‌లోని పొట్టి శ్రీరాములు బొమ్మ నుండి ఊరేగింపుకూడా నిర్వహించారు. ఎమ్మెల్యే ఈ సభలో మాట్లాడుతూ గతంలో మునిసిపల్ ఛైర్మెన్‌గా తాను పని చేసినపుడు ప్రారంభమై ఆగిపోయిన అభివృద్ధి కార్యక్రమాలు, టెండర్ల దశలో నిలిచి పోయినపనులకు సంబంధించినమూడు కోట్ల రూపాయల పెండింగ్ ఫైల్లకు అధికారుల చేత దుమ్ము దులిపిస్తున్నట్లు చెప్పారు. మరో నాలుగైదు రోజుల్లో వాటికి రీ వాల్యుయేషన్ టెండర్లు పిలుస్తారు. విజయ మహల్ గేటు బాక్సు పైపు బ్రిడ్జి వద్ద అప్రోచ్ రోడ్ల నిర్మాణం మరో నెల రోజుల్లో ప్రారంభ మవుతుంది. ఈ రోడ్డు శంకుస్థాపనకు వీలైతే అన్నను తీసుకొస్తానని రమేష్ రెడ్డి చెప్పారు. మద్రాసు బస్టాండులో నిర్మించి ప్రారంభం కాకుండా ఆగిపోయిన కూరగాయల మార్కెటును త్వరలో ప్రారంభిస్తున్నట్లు చెప్పారు. టౌన్‌లో అభివృద్ధి రథచక్రం కదిలింది. దానికి ఎదురే వుండకుండా చూస్తానని

**రమేష్‌రెడ్డి శపథం**

శపథం పట్టాడు ఎమ్మెల్యే. సభలో మాజీ కౌన్సిలర్లు పున్నం బసవయ్య, తల్పసాయి, సంక్రాంతి కళ్యాణ్, టి.డి.పి. పట్టణ కార్యదర్శి వై.వి. సుబ్బారావు, నారు కృష్ణయ్య తదితరులు పాల్గొన్నారు.

### సీనియర్ సిటిజన్స్ డే

రాష్ట్ర ప్రభుత్వ రిటైర్డ్ వుద్యోగుల సంఘం డిసెంబర్ 17 తేది నెల్లూరు టౌన్‌హాల్‌లో సీనియర్ సిటిజన్ డేను ఘనంగా జరిపింది. రిటైర్డ్ జిల్లా జడ్జి కె.పి. నారాయణరావు సభాధ్యక్షులుగా వ్యవహరించగా రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ పి.వెంకటసుబ్బయ్య సభను ప్రారంభించారు. కె. విశ్వజ్ఞానాచారి, పి.ఎన్. రామానుజాచారి వుపన్యసించారు. టి. పార్థసారథి స్వాగతించి సంఘం ఆవశ్యకతను వివరించారు. కళా ప్రపూర్ణ మరుపూరు కోదండ రామిరెడ్డి, గ్రిద్దలూరు గోపాలరావు, కె. విశ్వ జ్ఞానాచారి, మండి విశ్వనాథం, పొన్నాల రామ సుబ్బారెడ్డి, బి. స్వామిదాసు, పి.సుబ్బ రామయ్య, వై. చెంచు రామయ్య, పి. పెద్దబ్బ, బి. సీతురామి రెడ్డిలను కె.పి. నారాయణరావు, ఎన్.వి. శేశవరావులు దుశ్శాలువలతో సన్మానించారు. టి. దొరైస్వామి, డి. సుబ్బరాయుడు కార్యక్రమాన్ని పర్యవేక్షించి కృతజ్ఞతలు తెలిపారు. శ్రీమతి సావిత్రి ప్రార్థనతో ప్రారంభమైన కార్యక్రమం పి.వెంకట సుబ్బయ్య వందన సమర్పణతో ముగిసింది.

# నెల్లూరు రౌండప్ ?

## విశ్లేషకుడు

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి 26 తేది మద్రాసు మీదుగా వస్తారు. వస్తున్నారు. 27,28 తేదులలో వెంకటగిరి గ్రామాలు పర్యటించి, కాంగ్రెస్ కార్యకర్తలను ఉత్సాహ పరుస్తారు. 29 తేది గూడూరు టౌన్, సైదాపురం ఫిర్కాలలో పర్యటిస్తారు. 30తేది నెల్లూరులో కాంగ్రెస్ నాయకులను, కార్యకర్తలను కలుస్తారు. 31తేది తిరిగి హైదరాబాదు.

### ప్రసన్నకుమార్‌రెడ్డి

చక్కెర మంత్రి శ్రీ నల్లపురెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి 25తేది మంత్రిగా తొలిసారిగా నెల్లూరు వస్తున్నారు. ఆరోజు ఉదయం చార్మినార్‌లో గూడూరులో దిగి కోటకు వెళ్లారు. 26తేది తిరుమల వెళ్ళి, 27 తేది తిరిగి వస్తారు. ఆరోజు, ప్రక్కరోజు (28తేది) కోవూరులో పర్యటించి ఆ రాత్రికి హైదరాబాదు వెళ్తారు.

### సతీష్ చంద్ర

కలెక్టర్ శ్రీ ఎం సాంబశివరావు గారు వెస్టిండీస్ పర్యటనకు వెళ్లడంతో, జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర ఇన్‌ఛార్జి కలెక్టర్‌గా వ్యవహరిస్తున్నారు. నెలరోజులపాటు ఈ ఏర్పాటు వుంటుంది.

సతీష్‌చంద్ర గారికి నెల్లూరుకి ఏదో అవినాభావ సంబంధం వున్నట్లుంది. గూడూరు సబ్ కలెక్టర్‌గా వచ్చారాయన. డిఆర్‌డిఎ ప్రాజెక్టు డైరెక్టర్‌గా, జి.ప్ర.ప డిడిఒగా, ఎస్‌సి కార్పొరేషన్ ఇడిగా, సివిల్ సప్లయిస్ డిఎంగా, జాయింట్ కలెక్టర్‌గా ఆయన జిల్లాలో వుండే ముఖ్య పదవులన్నీ నిర్వహించారు. కలెక్టర్ సీటులోనూ కూర్చోవడంతో ఆ కొరతా తీరింది. నిప్పులాంటి నిజాయితీ; యముడికి, శివుడికి వెరవని నిర్భీకత; ఎంతటివాడు రెకమెండేషన్ చేసినా చించి బుట్టలో వేసి, తాను తలచిన విధంగా ఫైలు పరిష్కరించే సాహసం కల్గిన సతీష్ చంద్ర ఇన్నేళ్లపాటు ఎవరినీ నొప్పించకుండా కాలం గడప గల్గుతున్నారంటే ఆశ్చర్య పడవలసిన విషయమే. ఆయన వంటి అధికారులు అరుదుగా వుంటారు.

### మునిసిపల్ ఎన్నికలు

మునిసిపల్ ఎన్నికలకు రంగం సిద్ధమౌతున్నది. ప్రభుత్వ నిర్ణయం ఇంకా వెలువడక పోయినా, అధికారులు మాత్రం తమంతట తాముగా ఏర్పాట్లు చేసుకొని పోతున్నారు. సుప్రీంకోర్టు తీర్పు, కొత్త పంచాయితీ రాజ్ చట్టం నిబంధనలు, ఫిబ్రవరిలోగా ఎన్నికలు జరిపించక పోతే ప్రణాళిక నిధులు నిల్పి వేస్తామన్న కేంద్రం హెచ్చరిక, అన్నిటినీ మించి అసెంబ్లీ ఎన్నికలలో తెలుగుదేశం పట్ల ప్రజలు చూపిన ఆదరణలను పరిగణిస్తే ఎన్‌టి రామారావు గారు ఈ ఎన్నికలను వాయిదా వేసే ఆలోచన చేయరన్పిస్తుంది. ఇప్పుడే ఎన్నికలు జరిపించేస్తే పంచాయితీల స్థాయి నుంచి పార్టీని పటిష్ట పరచి, కాంగ్రెస్‌ను నామ రూపాలు లేకుండా చేయవచ్చునన్న ఆశ ఆయనలో వుంటుంది కదా!

నెల్లూరు మునిసిపాలిటీకి సంబంధించి తెలుగుదేశం అభ్యర్థి నిర్ణయం, ప్రచార బాధ్యత రమేష్‌రెడ్డికే లభిస్తాయి. చాలా మందే పోటీ పడుతున్నారా పదవికి. వై.టి. నాయుడు, శ్రీధర కృష్ణారెడ్డిల మధ్య గట్టి ఒత్తిడి నెదుర్కో వలసి వుంటుంది రమేష్ రెడ్డి. తన బావ, నరసింహ పురం సుందరయ్య కుమారుడు ఆనంద్ పేరూ పరిశీలిస్తున్నాడట. దీనిని సిపిఎం కోటా క్రింద కేటాయింప జేసుకొని, పోటీ చేయాలని వున్నం బసవయ్య ఆశ పడు తున్నట్లున్నారు. ఈ చీకాకు అంతా భరించలేక, ఛైర్మన్ పదవిని రిజర్వు చేయించడానికి రమేష్ రెడ్డి ప్రయత్నించినా ఆశ్చర్యం లేదు.

కాంగ్రెస్‌కు సంబంధించి నెల్లూరులో ఆనం, మాగుంట, కె.వి. సుబ్బారెడ్డిల మధ్య పోటీ వుంటుంది. మునిసిపల్ ఛైర్మన్ పదవి కోసం ఆనం వివేకానంద రెడ్డి చాలా కాలం నుంచి ఎదురు చూస్తున్నారు. అందువల్లే ఆయన మొన్న ఎమ్మెల్యే టిక్కెట్టుకు అప్లికేషన్ కూడా పెట్టలేదు. మాగుంట సుబ్బరామి రెడ్డి గారు దీనిలో వేలు పెడతారో, లేదో తెలియదు. ఓటమి తర్వాత వారి రాజకీయ వైఖరి ఏమిటన్నది అర్థం కావడం లేదు. ఇది వరకటి వలె రాజకీయాలలో చురుకుగా పాల్గొంటారా లేక ఎందుకొచ్చిన న్యూసెన్స్ అని ముఖం తప్పించేస్తారా అన్నది తెలితే వారి ప్రయత్నం ఎట్లా వుంటుందో చెప్పవచ్చు.

బహుశా వారు తమ కుటుంబ సభ్యు లెవరినీ రంగంలోకి దించక పోవచ్చున్నది అంచనా. తమ అనుచరులలో మంచి ఎంపిక చేస్తారని భావించాలి. జె.కె; కె.వి. సుబ్బారెడ్డిల ఇష్టా ఇష్టాలు కూడా పరిగణిస్తారా? జెకె మాగుంట చెప్పిన పేరుకు సరేనని వూరకుండి పోతాడేమో! కెవి సుబ్బారెడ్డికి తన అల్లుడు చంద్రయ్య నుంచి కూడా పోటీ వుంటుంది. మామా అల్లుళ్ల పోరును తప్పించడానికి, ఇద్దర్నీ వదిలేసి వేరొక పేరు ప్రతిపాదించి పిల్లి తీర్పు పాటిస్తారేమో సుబ్బరామరెడ్డిగారు!

జనార్దనరెడ్డి మొగ్గు ఎటు వుంటుందన్న దానిపై టికెట్ రెక్కి అదృష్టం ఆధార పడి వుంటుంది. జెకె, కెవి సుబ్బారెడ్డి లిద్దరూ ఆయనకు హితులు కారు. వివేకానంద రెడ్డిని నమ్మి సాయం చేస్తారా? చెప్పలేము.

గూడూరు జనరల్ అవుతుందా అన్న విషయం ఇంకా తేలలేదు. గతంలో రిజర్వుడు కాబట్టి ఇప్పుడు జనరల్ అయ్యేందుకే అవకాశాలు ఎక్కువ. కాంగ్రెస్‌లో జనార్దనరెడ్డి చెప్పిన పేరే ఖాయమౌతుంది. వేమారెడ్డి అభ్యంతరం, చికాకు లేవు కదా ఇప్పుడు? ఎల్లసిరి గోపాలరెడ్డి ఉత్సాహం కల్గిన యువకుడు; ఛాన్సిచ్చి చూస్తారా? తెలుగుదేశంలో ఎస్‌సి మాటే చెల్లుబాటు కావాలి. బల్లి దుర్గాప్రసాద్‌తో సమన్వయం కుదిరితే పేచీ లేదు. లేకుంటే రచ్చే!

కావలి కాంగ్రెస్‌లో యానాదిరెడ్డి మాటే ఫైనల్! జనరల్ అయితే ప్రభాకర నాయుడు, యానాదిశెట్టిలలో ఒకరిని ఎంపిక చేయవచ్చు. తెలుగుదేశం నారాయణకు ఛాన్స్ లభిస్తుందా?

ఛైర్మన్‌కు ప్రత్యక్ష ఎన్నికలు కాబట్టి కౌన్సిలర్ పదవులకు గిరాకీ తక్కువ.

### జిల్లాలో వర్షపాతం

| | |
|---|---|
| సూళ్లూరుపేట | 368.3 మి.మీ |
| కోట | 322.7 మి.మీ |
| తోటపల్లి గూడూరు | 309.6 మి.మీ |
| తడ | 273.4 మి.మీ |
| వాకాడు | 270.0 మి.మీ |
| ముత్తుకూరు | 267.5 మి.మీ |
| గూడూరు | 255.4 మి.మీ |
| కృష్ణపట్నం బేసిన్ | 254.0 మి.మీ |
| చిట్టమూరు | 242.8 మి.మీ |
| వెంకటాచలం | 216.2 మి.మీ |
| కొడవలూరు | 211.2 మి.మీ |
| నెల్లూరు | 205.0మి.మీ |
| చిల్లకూరు | 180.4 మి.మీ |
| ఒజిలి | 170.2మి.మీ |
| దొరవారిసత్రం? | 134.2 మి.మీ |
| కావలి | 108.6 మి.మీ |
| అల్లూరు | 89.6మి.మీ |
| నాయుడుపేట | 82.6 మి.మీ |
| [illegible] | 78.2 మి.మీ |
| పెళ్లకూరు | 70.9మి.మీ |
| సైదాపురం | 64.4మి.మీ |
| రాపూరు | 64.2మి.మీ |
| దక్కిలి | 58.8మి.మీ |
| పొదలకూరు | 58.0మి.మీ |
| ఆత్మకూరు | 52.3మి.మీ |
| చేజర్ల | 41.2మి.మీ |
| బాలాయపల్లి | 38.6మి.మీ |
| జలదంకి | 36.0మి.మీ |
| బోగోలు | 34.8మి.మీ |
| వింజమూరు | 32.0మి.మీ |
| కోవూరు | 19.4మి.మీ |
| మర్రిపాడు | 19.0మి.మీ |
| విడవలూరు | 7.6మి.మీ |

### జక్కా వెంకయ్యకు కొరడా

అల్లూరు ఎమ్మెల్యే శ్రీ జక్కా వెంకయ్య గారిని, అసెంబ్లీలో సిపిఎం విప్‌గా నియమించారు. ఈ పెద్ద వయస్సులో కొరడా చేత పట్టిస్తె, పాపం ఆయనేమి చేయగలడు. కృష్ణా జిల్లా నిడుమోలు ఎమ్మెల్యే శ్రీ పాటూరు రామయ్య సిపిఎం ఉపనాయకుడుగా నియమితులైనారు. రామయ్య, కృష్ణ జిల్లానుంచి గెల్చినా నెల్లూరీయుడు; ఉమ్మిపాలెం ఆయన స్వగ్రామం.

### నెల్లూరు జైలు మృత్యు కూపమై పోయింది!

నెల్లూరు జిల్లా జైలులో చావులు నిత్య సంఘటనలై పోయాయి. ప్రతిరోజూ ఎవరో ఒకరు అనారోగ్యం పాలౌతూనే వున్నారు. గత ఇరవై రోజులలో నలుగురు ఖైదీలు మృతిచెందారు. కనీసం వందమంది పలుకాల వ్యాధులతో ఆస్పత్రి పాలైనారు. చాలా ఆందోళనకరంగా వుంది పరిస్థితి.

నెల్లూరు జైలులో కెపాసిటీకి మించి ఖైదీలున్నారు. 500 మందికి వుద్దేశించిన ఈ జైలులో 650 మందిని కుక్కి వున్నారు. ఈ తొక్కిడికి తోడు, సిబ్బంది నిర్లక్ష్యంతో జైలులో అపరిశుభ్ర వాతావరణం ఏర్పడింది. భోజన సరఫరాలోనూ శుచి, శుభ్రత పాటిస్తున్నట్లు లేదు. ఫలితంగా అధిక శాతం ఖైదీలు అతిసారా వ్యాధికి, కడుపు నొప్పికి గురౌతున్నారు. జైలు డాక్టర్ తన కలివికాపుడం లేదని చేతులెత్తేశారు. ఆయన రోగులను చూడటం కూడా మానివేశారట. అవసరమైనా ఎవర్నీ పెద్దాస్పత్రికి పంపుతున్నారు. వ్యాధి సోకిన ఖైదీలను సకాలంలో ఆస్పత్రికి పంపక పోవడం వల్లే చావులు సంభవిస్తున్నాయని చెప్తున్నారు. ఆత్మకూరుకు చెందిన రాగి శ్రీనివాసులు అనే ఖైదీ విషయంలో అదే జరిగింది. అతడ్ని సకాలంలో ఆస్పత్రికి పంపివుంటే, బ్రతికివుండేవాడు. అది జరగక జైలులోనే చనిపోయాడు. ఈ ఘోరం చూసి ఖైదీలందరూ తిరగబడితే సరికి, పోలీసులను పిలిపించి లాఠీ ఛార్జి చేసి అదుపు చేశారట. ఇంత అలజడి రేగినా జైలు అధికారులలో మార్పు రాలేదు. 22 తేది మళ్లీ ముగ్గురు అత ఖైదీలు ఆస్పత్రి పాలైనారు. వీరి సమస్యా- వాంతులు, విరోచనాలే!

కడప రేంజి డిఐజి శ్రీ బి.ఆర్.బోస్ 22తేది జైలును సందర్శించి వెళ్లారు. జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర మెజిస్ట్రియల్

(మిగతా 6 పేజీలో

### రోదసీ చోరీలో నెల్లూరు పారిశ్రామికవేత్త

దేశమంతటినీ కలచి వేస్తున్న ఇస్రో రోదసి రహస్యాల విక్రేయపు కుంభకోణంలో నెల్లూరుకు చెందిన ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ పర్వతరెడ్డి రవీంద్ర రెడ్డి ప్రమేయం వున్నట్లు బిజెపి అధ్యక్షుడు శ్రీ ఎల్.కె. అద్వాని ఆరోపించారు.

'అభినవ కబీర్' గా విశ్వ విఖ్యాతి నందిన మహా నటుడు స్వర్గీయ పర్వతరెడ్డి రామచంద్రా రెడ్డి కుటుంబ సభ్యుడైన రవీంద్ర రెడ్డి హైదరాబాదు బాలానగర్‌లో అతి పెద్ద ఇంజనీరింగ్ పరిశ్రమ నిర్వహిస్తున్నారు. అంతరిక్ష పరిశోధన, రాకెట్ల ప్రయోగం, అణు పరీక్షల కవసరమైన పలు సున్నిత ఇంజనీరింగ్ పరికరాలు తయారు చేయడం వారి ప్రత్యేకత. శ్రీహరికోట నుంచి ప్రయోగించే పిఎస్ఎల్‌వి రాకెట్లలో అత్యంత కీలకమైన ఇంజన్ పరికరాలను ఆయన తయారు చేస్తారు. రోదసీ, అణు సంస్థలతో, రక్షణ శాఖతో ఆయనకు సంబంధాలున్నాయి. హైదరాబాదులో వున్న సంపన్నులలో ఒకరిగా వారికి గుర్తింపు వుంది. వారి స్వగ్రామం అల్లూరు.

ఆయనకు పివి నరసింహారావు కుమారుడు ప్రభాకర రావుతో సంబంధా లున్నాయని; మాజీ ముఖ్యమంత్రి శ్రీ కె. విజయ భాస్కర రెడ్డితో బంధుత్వ మున్నదని; పై స్థాయిలోని ఈ పలుకుబడితో రవీంద్ర రెడ్డి రోదసి రహస్యాలను పాకిస్తాన్‌కు చేరవేసే దేశ ద్రోహుల ముఠాకు సహకరించారని అద్వాని ఆరోపణ.

చాలా ఆందోళన కల్గించే వార్త ఇది. వ్యాపార పరంగా అత్యంత ఉన్నత శిఖరాలధిరోహించిన రవీంద్ర రెడ్డి దేశ ద్రోహానికి పాల్పడు తారంటె నమ్మశక్యం కావడం లేదు. ఇది నిజం కారనే భావిద్దాం.

## నెల్లూరు సబ్‌జడ్జి కోర్టులో

1989 సంవత్సరం వారంటు దరఖాస్తు నంబరు - 2.

1978 సంవత్సరం అసలు దావా నంబరు - 71.

నెల్లూరు ఫైనాన్స్ కార్పొరేషన్-డిక్రీదారు
సర్వేపల్లి బాబూరావు -బాకీదారు.

బాకీదారు తాలూకు యీ డిక్రీ బాకీకి అరుమానము వున్న నెల్లూరు మునిసిపాలిటీ సంతపేట కొట్టెంపూడి వారివీధి 10 వ వార్డు లోని డోరు నంబరు219 B (అసెస్‌మెంటు No. 7009) 16 అంకణములు(107.024 చదరపు మీటర్లు)గల స్థలము అందులోని 4 అంకణములు (26.756 చదరపు మీటర్లు) పెంకుటిల్లు 4 అంకణములు (26.756చదరపు మీటర్లు)జింకు రేకుల యింటితో సహా పై కోర్టు వారి వలన 25-1-95 తేది ఉదయం 10.30 గంటల నుండి వేలము వేయబడును.

డిక్రీదారు విలువ: రు.12,000/-;
అమీనా విలువ: రు.45,000/-;
బాకీదారు విలువ: రు.2,00,000/-

యం.ఏ.శేషారెడ్డి
డిక్రీదారు వకీలు.

## నెల్లూరు సబ్‌కోర్టులో

I.A.No. 1052/93
O.S.No. 123/90

S.B.I. A.D.B. Kovur -పిటీషనరు
Vs
1. Kour Chandrasekhara Reddy & 3 Others -రెస్పాండెంట్లు

### ఆక్షేపణ నోటీసు

To

1.కోడూరు చంద్రశేఖరరెడ్డి; 2. కోడూరు పద్మావతి; 3.కోడూరు సుశీలమ్మ; 4.కోడూరు వెంకట్రామిరెడ్డి; గాజావాక విశాఖపట్టణం;

పై నంబరున పిటీషనరు మీపై ఫైనల్ డిక్రీ పిటిషన్ దాఖలు చేసుకున్నందున మీకు ఏవైనా ఆక్షేపణలు వున్నయెడల పై కోర్టువారి ఎదుట 20-1-95 తేది ఉదయం 10.30 లకు స్వయముగా గాని, వకీలు ద్వారా గాని, హాజరై తెలుపుకోవలసినది. లేని యెడల మీ పరోక్షమున పిటిషన్ తీర్మానించ బడును.

వ్రాయిడా తేది -20-1-95.

S.L.V.రమణారెడ్డి, S.P.S. విజయసారథి
పిటీషను అడ్వకేట్లు

ఓయొబ్బో రామచంద్రా నీకేం మతిపోయిందయ్యా బాబు???
ఏదో పగలబడిస్తావని పోటీ అభ్యర్థిగా పోటీకి నిలబెడితే
కనీసం డిపాజిట్లు కాదు కదా మాటయోట్లైనా తెల్లేదు!

## సణుగుడు

4 పేజీ కొరవ

సమస్యా! దానికిన్ని పగటి వేషాలా?

ఎన్టీఆర్ అధికారులతో, ఇతర మంత్రులతో, ముఖ్యులతో సమావేశాలు జరిపే టప్పుడు, సంభాషించే టప్పుడు శ్రీమతి లక్ష్మీపార్వతి ఆయన కుర్చీ ప్రక్కనే నిలబడి వుంటున్నారు. ఆయన చేతిని తన చేతికి తీసుకొని మర్దన చేయడం, లేదా మోకాలిపై చేయివేసి, నిమరడం చేస్తుంటే ఎదురుగా కూర్చుని వుండే వారికి చాలా ఇబ్బందిగా వుంటున్నది. సీనియర్ ఐఎఎస్ అధికారులు ఎన్టీఆర్‌ను ఇంటి దగ్గర కలిసి మాట్లాడడానికి సిగ్గు పడిపోతున్నారు; ఎవరితోనూ చెప్పుకోలేక సతమతమై పోతున్నారు.

'శివరంజని' సినిమా పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ ఎన్టీఆర్, లక్ష్మీపార్వతి గురించి ఏమి చెప్పాడో చదవండి-

"72 ఏళ్ల వయసులో ఒక నూతనోత్సాహం, ఉల్లాసం, ఉద్వేగం, సరసం అనేది నాకు తెలియ జెప్పిందామె. ఇటువంటి నూతన ఆవేశం, నూతన ఉత్సాహం నాలో కల్గించింది కాబట్టే నా వివాహం...."

యాభై ఏళ్లు కట్టుకొన్న భార్యతో సంసారం చేసి, పదిమంది పిల్లల్ని కని, పండు వయస్సు వచ్చిన తర్వాత ఆయన కిప్పుడు కొత్త సరసాలు నేర్పించాలా? కొత్త ఆవేశం కావాలా? ఆ గలీజు మానసిక స్థితిని పబ్లిక్‌గా పత్రికల వారికి చెప్పుకోవాలా? ఒక రాష్ట్రానికి నాయకుడిగా వున్నవారు ఇంత మనో దౌర్బల్యం కల్గినవాడు కావడం ఆంధ్ర రాష్ట్రం ఎప్పుడు చేసుకున్న పాపమో!

అదే పత్రికలో, అదే ఇంటర్వ్యూలో లక్ష్మీపార్వతిగారు ఇంకొక మాట కూడా చెప్పారు. సంసారులు తలదించు కోవలసిన తీరులో సాగుతున్న వారి వైవాహిక జీవిత పరమార్థ మేమిటో ఒక్క ముక్కలో తేల్చి [illegible]రామె.

"ప్రశ్న - మన పొరుగు రాష్ట్రమైన తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితని ఎంజీఆర్ వారసురాలిగా ఆ రాష్ట్ర ప్రజలు అధికార పీఠం మీద కూర్చోబెట్టారు. తమిళనాడు రాజకీయ చరిత్ర ఇక్కడ భవిష్యత్‌లో పునరావృత మౌతుందని పరిశీలకులు అంటున్న మాట. దీనిమీద మీ వ్యాఖ్య ఏమిటి?

పార్వతి సమాధానం : అయినప్పుడు చూద్దాం; నేనిప్పుడేమీ వ్యాఖ్యానించను.

ఆమె భవిష్యత్ ఆలోచన లేమిటో ఈ ఒక్క ముక్కతోనే అర్థమౌతున్నాయి. "అయినప్పుడు చూద్దామంటే". అవ్వాలనే ఆశ వున్నట్లే కదా? దీనిమీద ఆమె వ్యాఖ్యానమే కాదు, ఎవరి వ్యాఖ్య కూడా అనవసరమే.. ఇది తెలుగు ప్రజలకు పట్టబోతున్న భవిష్యత్ ప్రారబ్ధం; అంతే!

## కొత్తమంత్రులు

(మొదటి పేజీ కొరవ)

లక్ష్మీపార్వతి, పెద్దల్లుడు డాక్టర్ దగ్గుబాటి పట్టు బట్టారు. అయితే చంద్రబాబు దీన్ని తీవ్రంగా వ్యతిరేకించడంతో ఎన్టీఆర్ ఇరకాటంలో పడ్డారు. చివరకు మధ్యే మార్గంగా బాబు వర్గీయులైన విద్యాధర రావు, మాధవరెడ్డిలను కూడా మంత్రి వర్గంలో తీసుకునేందుకు ఎన్టీఆర్ అంగీకరించడంతో గాలి ముద్దుకు లైన్ క్లియర్ అయింది. అయితే ముద్దుకు విద్యాశాఖ మొత్తాన్ని కేటాయించగా చంద్రబాబు చక్రం అడ్డం వేసి దాన్ని రెండుగా చీల్చి కేవలం ఉన్నత విద్య మాత్రమే ముద్దుకు దక్కేట్లు చెయగలిగాడు. మొత్తం మంత్రి వర్గంలో పెద్దల్లుడి వర్గీయులు 20 మంది దాకా వుండగా బాబు వర్గీయులు అర డజనుమంది కూడా లేకపోవటం విశేషం. మంత్రివర్గం ఏర్పాటులో పెద్దల్లుడు, లక్ష్మీపార్వతి ఒక వర్గంగా వ్యవహరించటంతో బా- వర్గానికి గండి పడింది.

### వృద్ధనారీ పతివ్రత

వృద్ధ నారీ పతివ్రత సామెత [illegible] కాంగ్రెస్ పార్టీ నుంచి [illegible]కు వచ్చిన చంద్రబాబు నాయుడు కాంగ్రెస్ పార్టీని అంటరాని పార్టీగా అభివర్ణిస్తూ, కాంగ్రెస్ మంత్రుల దగ్గర పనిచేసిన వ్యక్తిగత సిబ్బందిని, పోలీసులను, చివరకు అటెండర్లను కూడా దూరంగా పెట్టాలని మంత్రివర్గ సమావేశంలో ముఖ్యమంత్రికి సూచించారట. కాంగ్రెస్ మంత్రుల దగ్గర పనిచేసిన సిబ్బంది కనిపిస్తే చాలు కొత్త మంత్రులు భయపడి పారిపోతున్నారు. తెలుగుదేశం ప్రభుత్వం అంతా కొత్తగా వుండాలంటే కాంగ్రెస్ వాసనలున్న సిబ్బందిని, ఉద్యోగుల్ని నిర్దాక్షిణ్యంగా దూరం చేయాలని చంద్రబాబు గట్టిగా చెబుతున్నారు. కాగా పెద్దల్లుడు దీన్ని ఆసరా చేసుకొని కొత్తగా పిఎల. పి.ఎస్‌ల జాబితాను తయారుచేసి మంత్రుల మీద రుద్దుతున్నారు. కనీసం తమ అంతరంగిక సిబ్బందినైనా నియమించు కోలేక మంత్రులు నిస్సహాయంగా పెదవి విరుస్తున్నారు. మంత్రుల దగ్గర సొంత మనుషుల్ని పి.ఏలు, పి.ఎస్‌లుగా పెట్టడం వల్ల మంత్రుల కార్యకలాపాలపై నిఘా వేయడం తోపాటు మంత్రుల ప్రమేయం లేకుండానే తమ పనుల్ని చక్కబెట్టుకో వచ్చన్నది పెద్దల్లుడి మాస్టర్ ప్లాన్ అట.

మొత్తం మీద కొత్త మంత్రుల్లో చాలామంది 'దాసోహం' బాపతు వారే కావటంతో ఇప్పట్లో ఎన్టీఆర్‌కు వచ్చిన ఇబ్బందేమీ లేదు.

## బుద్ధిరాలేదు

(మొదటి పేజీ కొరవ)

కాగా రాష్ట్ర కాంగ్రెస్‌ను పునర్వ్యవ స్థీకరించి వచ్చే స్థానిక సంస్థల ఎన్నికల నాటికి పటిష్ట పరచాలని, పలువురు ఎంపిలు ప్రధాన మంత్రికి విజ్ఞప్తి చేశారు. పిసిసి అధ్యక్షుడు శ్రీ కమాలుద్దీన్ అహ్మద్ కూడా పిసిసి పీఠం పట్ల నిరాసక్తతగా వున్నారు. ఆయన ఇప్పటికే తన రాజీనామాను పి.వి.కి ఇచ్చారదని అంటున్నారు. పిసిసి కొత్త అధ్యక్షుడిగా ఎవర్ని నియమించాలన్న దానిపై ప్రస్తుతం హస్తినలో తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఈ నేపథ్యంలో రాష్ట్ర కాంగ్రెస్ పతనానికి కోట్ల విజయ భాస్కర రెడ్డే కారణమంటూ వై.ఎస్. వర్గీయులు పి.వి.కి ఫిర్యాదు చేశారు. అలాగే వై.ఎస్. మూలంగానే పార్టీకి నష్టం జరిగిందని కోట్ల వర్గీయులు అంటున్నారు.

## కాంగ్రెస్

(2వ పేజీ కొరవ)

ఎవరుంటారు? అన్ని గ్రూపుల వారు పెద్ద మనసు చేసుకుంటే - మేకపాటి రాజమోహన రెడ్డి దీనికి అనువైన వాడు. అయితే నిన్నగాక మొన్న కాంగ్రెస్‌ను ఓడించడానికి కంకణం కట్టుకొని పని చేసిన వాడు అభ్యర్థిగా వుండడం అభ్యంతర మంటారేమో! కాని, అంతరాత్మలను ప్రశ్నించుకుంటే కాంగ్రెస్ ఓటమిని ఎక్కడో ఒక చోట కోరని నాయకుడు ఎవరైనా వున్నారా?

ఈ ప్రతిపాదనకు జనార్దన [illegible] గారు ఎట్లా ప్రతిస్పందిస్తారో తెలియదు కాని శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ సైతం జిల్లా పరిషత్ పదవికి అర్హురాలైన నాయకురాలే! వెంకట గిరిలో ఆమె ఇప్పటికే రాజకీయ ఒనమాలు దిద్ది, రాటు దేలిపోయి వున్నారు. ఆమె పట్ల ఎవరికీ కోపతాపాలూ లేవు.

ఒక వర్గం ప్రతినిధిగా అనర్హుడు కాకుంటే, ఆనం రామనారాయణ రెడ్డి కూడా పరిశీలించ దగినవాడే.

వీరెవ్వరూ కాకుండా, ఈ పదవిని మాగుంట వారికి [illegible] చెప్పడం కాంగ్రెస్‌కు మంచిది - సుబ్బరామ రెడ్డి గారు స్వయంగా గాని, తన సోదరుని చేత గాని పోటీ చేయించి పార్టీని నిలబెట్టు కోవచ్చు.

## నెల్లూరు ముచ్చట్లు

(5వపేజీ కొరవ)

దర్యాప్తుకు ఆదేశించారు ఖైదీలం డాక్టర్ సెలవుపై వెళ్లిపోయారు.

జైలులోని వాతావరణం ఇంత అహేతుకంగా ఎందుకు తయారైంది? డాక్టర్ వుండే పరిస్థితి ఇంత దూరం ఎందుకు వచ్చింది? అధికారులు తక్షణం పరిస్థితి చక్కదిద్ది, ఖైదీల ప్రాణాలు కాపాడడం అవసరం.

### జూబిలీ ఆస్పత్రిలో ఫెర్టిలిటి క్లినిక్

పిల్లలు కల్గని దంపతులకు పరీక్షలుచేసి, సంతాన ప్రాప్తి కల్గించడానికి నెల్లూరు జూబిలీ ఆస్పత్రిలో ఫెర్టిలిటీ క్లినిక్ నెలకొల్పారు. ఇందులో దంపతులకిద్దరికీ వుచితంగా పరీక్షలు జరిపించి, అవసరమైన మందులు, ఇంజక్షన్లు వేస్తారు. రాష్ట్రంలో ప్రభుత్వ ఆస్పత్రులలో ఇటువంటి క్లినిక్ ఏర్పాటు చేయడం ఇదే ప్రథమ మంటున్నారు సూపరింటెండెంట్ డాక్టర్. కె. కామేశ్వరమ్మగారు. ప్రతి మంగళవారం క్లినిక్ పనిచేస్తుంది. వైద్య సలహాలు, పరీక్షలు ఉచితం. సంతానం కోసం పరితపించే పేద, మధ్య తరగతి గృహిణులకు సదవకాశం ఇది.

### విష్ణు బదలీ

నెల్లూరు జిల్లా పరిషత్ సిఇఒ శ్రీ విష్ణు బదలీ అయ్యారు; కర్నూలు నుంచి శ్రీ బ్రహ్మేంద్ర రావును ఇక్కడ నియమించారు. విష్ణుగారిని ఎన్నికల ముందే బదలీచేశారు; కాని నోటిఫికేషన్ రావడంతో ఆ ఉత్తర్వు అమలుకాలేదు. ఇప్పుడు ఆచరణలోకి వచ్చింది. కొత్త ప్రభుత్వం ఏర్పడిన తర్వాత జిల్లాలో జరిగిన తొలి బదలీ ఇది.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 4,200/- |
| | 9674 | 4,400/- |
| ఐ.ఆర్.20. | | 3,700/- |

## పులివెందుల మున్సిప్ వారి కోర్టులో

I.A.226/93
O.S. 174/93

స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా పులివెందుల -పిటీషనరు
మరియు -వారి

బడుగు మార్క్ చనిపోయి నందున, ఇతని వారసులు
బడుగు అంగమ్మ R1 -రెస్పాండెట్లు
బడుగు జాన్ ఊడవగండ్ల R2 ప్రతివాదులు
తొండూరు మండలం

పై పిటీషను నోటీసు నిమిత్తమై రెండవ రెస్పాండెంటుకు వా[illegible] 30-12-94 తేదిన పై కోర్టులో ఉన్నదనియు ఆక్షేపణలున్న తెలుపుకోవచ్చుననియు తెల్పడమైనది.

G.ప్రభాకరశాస్త్రి,
అడ్వకేటు, పులివెందుల.

# గూడూరులో గబ్బు భరించలేము బాబోయ్!

లక్షలాది రూపాయల ప్రపంచ బ్యాంకు నిధులు వెచ్చించి వేసిన గూడూరు టౌనులోని రోడ్లు గత నాలుగు రోజులుగా కురుస్తున్న భారీ వర్షాలకు బాగా దెబ్బతిని పోయాయి. వాహనాల సంగతి అటుంచితే పాదచారులు సైతం అడుగు తీసి అడుగు వేయనంత అధ్వాన్న స్థితికి చేరుకొన్నాయి. డ్రైనేజి సౌకర్యం అంతంత మాత్రంగా వుండడం వల్ల మురుగు కాల్వల్లోని నీరు పొంగి రోడ్లపై ప్రవహిస్తున్నది. రోడ్లపై అక్కడక్కడా పెద్ద పెద్ద గుంటలు పడి వుండడం వల్ల వాహనాలు పక్కకు రాగానే మురికి నీళ్లు ఎక్కడ పైన పడతాయోనని ప్రజలు పరుగులు తీస్తున్నారు. ప్రస్తుతం టౌన్‌లో ఏ వైపు చూసినా బురదతో నిండిన రోడ్లతో పేరుకు పోయి వున్న చెత్త కుప్పలుగబ్బు కొడుతున్నాయి. వర్షాలకు బజ్జీసాహెబ్ పేట, వివేకానంద రోడ్డు, ముత్యాల పేట, రాజావీధి, సొసైటీ కాలనీ, ఆర్టీసి బస్టాండ్ రోడ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. రోడ్డుకు యిరు ప్రక్కలా వున్న ఫుట్‌పాత్‌ను వ్యాపారులు ఆక్రమించడం వల్ల బురదతో నిండిన రోడ్లపై ప్రజలు నడవను పడరాని పాట్లు పడుతున్నారు. ముత్యాలపేట, రైల్వేకాలనీల్లో మురుగు నీరు పోయే వసతి లేకపోవడం వల్ల మండల ప్రజాపరిషత్, సబ్‌కలెక్టర్ కార్యాలయాల్లో నీళ్లు ప్రవహిస్తున్నాయి. ముత్యాలపేటలోని రోడ్డు పెద్ద పెద్ద గుంటలు పడడంతో వీటిల్లో ఇరుక్కుపోయిన వాహనాలు బయటపడలేక అక్కడికక్కడే నిలిచిపోయి వున్నాయి. ఇటీవల ఎలక్ట్రానిక్ ఎక్స్చేంజి కనెక్షన్ల కోసం రోడ్లను పగులగొట్టి కేబుల్స్ వేసి సరిగా గుంటలు పూడ్చక పోవడం వల్ల

**వీధుల్లో మురుగు నీరు కాల్వలు కట్టి పారుతూంది; చెత్త కుళ్లి కంపు కొడుతూంది; రోడ్లు అధ్వాన్నమై అడుసు పేరుకున్నది!**

ఇప్పుడు సమస్యగా పరిణమించాయి. మునిసిపల్ మార్కెట్‌లో కూడా డ్రైన్లు లేకపోవడంవల్ల అక్కడా దుర్గంధం వెదజల్లుతుంది. రాణీపేట, మాయబజారులో పందుల స్వైర విహారానికి అదుపు ఆపు లేదు. నర్సింగరావు పేట, మాలవ్యనగర్‌లో ఇటీవల వేసిన సిమెంటు రోడ్డు కూడా అధ్వాన్నమై పోయింది. వర్షాలు తగ్గినాక రోడ్డు భవనాలు, పంచాయితీ రాజ్, మునిసిపల్ అధికారులు సంయుక్తంగా రోడ్ల మరమ్మత్తులు చేపట్టడంతో పాటు దిగజారి పోయివున్న పారిశుద్ధ్యాన్ని పునరుద్ధరించ వలసి వుంది.

## గూడూరులో ఘనంగా హాకీ పోటీలు!

గూడూరు స్పోర్ట్స్ అండ్ కల్చరల్ అసోసియేషన్ రాష్ట్రస్థాయి బాల, బాలికల హాకీ పోటీలను ఘనంగా నిర్వహించింది. సోమవారం పోటాపోటీగా జరిగిన ఆటల్లో 17 ఏళ్ళ లోపు బాలుర విభాగంలో కడప జిల్లా జట్టు విజేత కాగా, హైదరాబాద్ జట్టు ద్వితీయ స్థానంలో నిలిచింది. 14 ఏళ్ల లోపు బాలుర విభాగంలో కర్నూల్, వరంగల్ జిల్లా జట్లు వరుస స్థానాలు పొందాయి. బాలికల 17 సంవత్సరాల విభాగంలో నెల్లూరు, కృష్ణాజిల్లా జట్ల మధ్య నువ్వా నేనా రీతిలో జరిగినా నెల్లూరు చివరి విజేతగా నిలిచింది. 14 ఏళ్ల లోపు బాలికల విభాగంలో నెల్లూరు, రంగారెడ్డి జట్లు వరుస స్థానాలు పొందాయి. బహుమతి ప్రదాన సభకు ఫిజికల్ ఎడ్యుకేషన్ ఇన్స్‌పెక్టర్ రాధాకృష్ణ అధ్యక్షత వహించారు. గూడూరు స్పోర్ట్స్ అండ్ కల్చరల్ అసోసియేషన్ అధ్యక్షులు లయన్ వై. చలపతిరావు వర్షం వచ్చినా అధికారులు, క్రీడాకారులు ఓర్పు వహించి పోటీలు విజయవంతం చేసినందుకు కృతజ్ఞతలు తెలియ జేశారు.

పైనుంచి పడే వానతుకాదు, క్రిందనుంచి చిలకరింప బడే బురద జల్లుకు అడ్డుగా గొడుగు పట్టుకుంటున్న ఒక అభాగ్యుడు; రోడ్లలో గూడూరు టౌన్ మురుగునీటి మడుగును చల్లుకొంటూ వెళ్తున్న ఆర్టీసి బస్సు.

# ఇళ్లలో దూరి దౌర్జన్యం చేసే అధికారం తాసిల్దారుకువుందా?

గూడూరు టౌన్, బసిఎస్ రోడ్డులోని ఒక ఇంటిలోకి తాసిల్దారు, ఇతర రెవిన్యూ సిబ్బంది మొన్న 20 తేది రాత్రి 7 గంటలప్పుడు దౌర్జన్యంగా దూరి, గందరగోళం సృష్టించారు. తామొక్కరే రావడం కాకుండా తమతోటి ఒక అంబాసిడర్ కారు నిండా రౌడీలను తీసుకవచ్చి, వారు గలభాచేస్తుంటే చూస్తూ వుండినారట. ఈ గొడవ కంతటికీ కారణం- ఒకే ఒక్క అంకణం దొంగ పట్టా!

బసిఎస్ రోడ్డులోని స్థలం ఎప్పుడో యాభైఏళ్ళ క్రితం ఆక్రమణకు గురైంది. అప్పుడే అక్కడ ఇళ్లు కట్టు కున్నారు. వాటిని ఖాళీ చేయించడం అసాధ్యమవడంతో, 1980లో ఆ ఇళ్లలోని వారందరికీ మార్కెట్‌ధర కట్టించుకొని పట్టాలు ఇచ్చేశారు. శేషగిరిరావు అనే వ్యక్తి అట్నే పట్టా పొందారు. అతడికి, అతడి ప్రక్క ఇంటిలోని వారికి ఏదో వివాదం వుంది. దానితో వారు శేషగిరి రావు స్థలంపై కోర్టులో దావా వేశారు. మేజిస్ట్రేట్ కోర్టునుంచి హైకోర్టు వరకు నడచిన ఆ కేసు చివరకు శేషగిరి రావు పక్షమే అయింది. కోర్టుద్వారా చేయలేని పని, అధికార్ల ద్వారా చేయించాలను కున్నారో, ఏమో - తమకు ఒక్క అంకణం పట్టా వున్నట్లు సృష్టించారట, అది శేషగిరి రావు స్థలంలో కలిసి వుందని తాసిల్దారుకి చెప్పారట. ఆ బినామీ పట్టా ఆధారంగా ఆయన దౌర్జన్యంగా ఇంటిలోపలికి దూరి; ఆడవాళ్లు, పిల్లలు వున్నారన్న విచక్షణ చూపకుండా రౌడీల సహాయంతో ఇంటిగోడ పగుల గొట్టబోయారట. కాని చుట్టుప్రక్కల జనం మూగి, రచ్చ రేగడంతో చల్లగా వెనక్కు జారుకున్నట్లున్నారు.

ఎవరీ తాసిల్దారు? ఏమిటీ దౌర్జన్యం? స్థలం వివాదం వుంటే, ఇరు పక్షాలనూ పిలిపించి

**గూడూరు రెవిన్యూ అధికారుల జులుం ప్రవర్తన**

విచారించాలి; లేదా నోటీసు ఇచ్చి, సర్వేచేయించి నిజానిజాలు తేల్చాలి. చీకటి పడిన తర్వాత రౌడీల సాయంతో ఇల్లు పగులగొట్టే అధికారం ఆయనకు ఎవరిచ్చారు? అట్లా ఇండ్లోదూరే అధికారం ఆయనకువుందా? అంత బరితెగించి ప్రవర్తించడానికి ఆయనకు ఎంత లాభం ముట్టింది? ఏ ప్రయోజనం లేకుండా ఆయన స్థాయి కల్గిన అధికారి అంత నిష్కర్షా రహితంగా ప్రవర్తిస్తారా? 1980లో రెవిన్యూ శాఖ ఇచ్చిన పట్టాలు ఇప్పుడు ఎందుకు మార్చవలసి వచ్చింది?

ఏది ఏమైనా రెవిన్యూ అధికార్లు జులుంతో, దౌర్జన్యంతో ప్రవర్తించ బోవడం క్షమార్హం కాదు. కలెక్టర్‌గారు దీనిపై తగిన చర్య తీసుకోవడం అవసరం.

# జోరేపల్లి మోటార్ల మోసం

రాపూరు తాలూకా జోరేపల్లి గ్రామంలో 30 హరిజన కుటుంబాలు అధికార్ల అవినీతి, వ్యాపారుల కక్కుర్తికి బలై దిక్కు తోచని స్థితిలో పడిపోయాయి. ఈ గ్రామంలోని పేదలకు ప్రభుత్వమిచ్చిన భూమివుంది. కాని దాన్ని పండించుకోను నీళ్లులేవు. చాలా కాలం నుంచి బీడు పడివున్న ఈ పొలాలను సాగు యోగ్యం చేయడానికి కలెక్టర్ గారు వారికి బావులు మంజూరు చేశారు. బావులు త్రవ్వకోగానే జీవనాధార పథకం క్రింద ఒక్కొక్కరికి పదివేల లెక్కన మోటర్లు, పంపులు ఇచ్చారు. నిధుల మంజూరు వరకు సాఫీగానే జరిగింది. ఆ తర్వాతే వచ్చింది తంటా అంతా!

నెల్లూరులోని మూర్తి ఇంజనీరింగ్ అనే కంపెనీకి మోటర్ల సరఫరా కాంట్రాక్టు ఇచ్చారట. వారు వీరికివ్వాల్సిన 5 హెచ్‌పి 1440 ఆర్‌పిఎం బదలు, 2820 ఆర్‌పిఎం

## జిల్లావార్తలు

మోటార్లు సరఫరా చేశారు. మామూలు మోటర్లకంటె ఇవి వెయ్యి రూపాయల ధర తక్కువ. పై పెచ్చు బావుల్లో నీళ్లు తోడడానికి పనికిరావు. సగం మోటార్లు స్విచ్ ఆన్ చేయగానే కాలి పోయాయి. పనిచేసిన వాటి నుంచి నీళ్లు రాలేదు. ఫలితం - మొత్తం పథకం, దానికి పెట్టిన లక్షలాది రూపాయల ఖర్చు బూడిదలో పోసిన పన్నీరై పోయింది. హరిజనుల భూములు యథాప్రకారం బీడుగానే వుండి పోయాయి.

ఈ మోసం గురించి వారు కలెక్టర్‌కు మొరపెట్టు కున్నారు. ఆయన వెంటనే దీనిపై దర్యాప్తు జరిపి, మంచి మోటార్లు ఇప్పించమని డిఆర్‌డిఎ అధికారులను ఆదేశించారు. కానీ ఆ కంపెనీతో ఆ అధికార్లకు ఏమి మొగమాటం వుందో కాని వారెవ్వరూ చర్య తీసుకోలేదు. ఇంకెవ్వరికి చెప్పుకుంటె మా కష్టాలు తీరుతాయని ఆవేదన చెందుతున్నారు పాపమా పేద హరిజనులు. కలెక్టర్‌గారూ- మీరే చెప్పాలి వారి ప్రశ్నకు సమాధానం!

## జిల్లా విద్యాధికారి మాంత్రికుడైనవేళ...

జిల్లాలో తొలిసారిగా గ్రామీణ ప్రాంతమైన ఆత్మకూరులో నాలుగురోజులపాటు జరిగిన సైన్స్‌ఫేర్

కొరవ 8 పేజిలో

## నెల్లూరు సంగతులు

(4వ పేజీ కొరవ)

సత్కరించారు. ప్రదర్శనలో విద్యా, వైద్య, విజ్ఞాన, సాహిత్య రంగాలకు సంబంధించిన పలు రకాల పుస్తకాలు చోటు చేసుకొని వున్నాయి. ఒకసారి పుస్తక ప్రియులు సందర్శిస్తే వారి అభిరుచికి తగ్గ పుస్తకాలు దొరకటం ఖాయం!

### డాక్టర్ శివప్రతాప్ రెడ్డి అభినందన సభ

హస్తవాసి గల నేత్ర వైద్యుడు డాక్టర్ శివప్రతాప్ రెడ్డి లండన్‌లో ప్రత్యేక శిక్షణను విజయవంతంగా పూర్తి చేసుకొని వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని ఛాంబర్ ఆఫ్ కామర్స్ 18 తేది అభినందన సభను ఏర్పాటు చేసింది. అధ్యక్షత వహించిన ఛాంబర్ కార్యదర్శి వావిళ్ళ సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ రోటరీ క్లబ్ సభ్యుడు కూడా అయిన డాక్టర్ శివ ప్రతాప్ రెడ్డి మితభాషి అని ప్రశంసిస్తూ, త్వరలో ఆయన నేతృత్వంలో ప్రారంభమయ్యే రోటరీ ఐ ఫౌండేషన్ ప్రాజెక్ట్ విజయ వంతమవుతుందన్న ఆశా భావాన్ని వ్యక్తం చేశారు. సన్మానానికి కృతజ్ఞతల అనంతరం డాక్టర్ మాట్లాడుతూ తాను లండన్‌లో పొందిన శిక్షణ వల్ల మైనస్ నాలుగు చూపు వున్న వారికి లావు కళ్లద్దాలు బదులుగా లేజర్ చికిత్స ద్వారా నయం చేయవచ్చున్నారు. విమల్ శిల్క్స్ ఐ.వెంకటేశ్వర రావు, రోటేరియన్లు కె.సత్య నారాయణ, టి.ఎ. పద్మనాభ రావు, ఎమ్. ధర్మారెడ్డి, బి.వేణు గోపాల్ తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

### కోవూరు సబార్డినేటు జడ్జిగారి కోర్టులో

E.A. 195/94
E.P.29/91
O.S. 7/88

బ్యాంక్ ఆఫ్ ఇండియా, నెల్లూరు-DHR.
Vs పఠాన్ గౌస్‌ఖాన్ వగైరాలు -JDR.

To

3. పఠాన్ నజీర్ ఖాన్ S/o. నిలార్‌ఖాన్, కోవూరు. 4. పఠాన్ బషీర్ S/o.హనీఫ్, కావలి. 5. P. కరీమా W/o. మస్తాన్, కందుకూరు
6. P.S.M. దాహా W/o. మాహబీన్ దాహా, ఇందుకూరు పేట.7. P. హసీదాబీబీగం W/o ఖాదర్‌మస్తాన్, మూలపేట, నెల్లూరు; 8. P. వహీదా W/o. అల్లాబక్ష్, సంతపేట, నెల్లూరు.

పై నంబరున DHR 2వ JDR చనిపోయినందున మిమ్ములను (JDR 3 to 8) వారసులుగా చేర్చమని కోరుచూ పిటీషను పై కోర్టువారి యెదుట దాఖలు చేసినందున మీ ఆక్షేపణలు కొరకై 27-12-94 తేదిన వాయిదా వేసియున్నారు. కావున ఆ దినం ఉదయం 10గంటలకు పై కోర్టువారి ఎదుట హాజరై మీయొక్క ఆక్షేపణలు తెల్పుకొనని యెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

-S.L.V. రమణారెడ్డి,
DHR అడ్వకేటు.

సభారంభంలో అర్రా కృష్ణమూర్తి ప్రార్థన గీతం ఆలపించారు.

### పరిశుభ్రమైన రక్తం అందించే బ్లడ్ బ్యాంక్!

ఎయిడ్స్ వ్యాధి భయం రక్తదాన వుద్యమానికి ఆటంకంగా మారింది. అటువంటి భయమేమీ లేకుండా నెల్లూరీయులు రక్తం ఎక్కించు కొనేందుకు వీలుగా పరీక్ష చేసిన, పరిశుభ్రమైన రక్తం అందించే బ్లడ్ బ్యాంకును నాలుగు నెలల్లో టౌన్‌లో ప్రారంభిస్తున్నట్లు రెడ్‌క్రాస్ జిల్లా కార్యదర్శి డాక్టర్ ఎ.సుబ్రహ్మణ్యం చెప్పారు. ప్రపంచ ఎయిడ్స్ దినోత్సవం సందర్భంగా జిల్లా వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో టౌన్ హాల్‌లో ఏర్పాటు చేసిన సభలో ఎయిడ్స్ వ్యాధి తీరు తెన్నులు వివరించారు. జిల్లా వైద్య శాఖాధికారి జి.వి.నారాయణ మాట్లాడుతూరాష్ట్రంలో 193 మందికి ఎయిడ్స్ వున్నట్లు చెప్పారు. డాక్టర్ సి.ఆర్. రెడ్డి మాట్లాడుతూ 84 సంవత్సరంలో జిల్లాలోని అనంత సాగరం మండలంలో మొదటి ఎయిడ్స్ కేసు గుర్తించినట్లు చెప్పారు. డాక్టర్ జెట్టి శేషారెడ్డి, డాక్టర్ అశోక్ తదితరులు సభలో ప్రసంగించారు. సభ ముందు నిర్వహించిన ర్యాలీలో వివిధ నర్సింగ్ స్కూళ్ల విద్యార్థినులు పాల్గొన్నారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖ ఎంబర్స్‌పై ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్ పలువుర్ని ఆలోచింప జేసింది.

### గ్యాస్ కనెక్షన్ల బుకింగ్ వాయిదా

రెడ్డి అండ్ రెడ్డి హెచ్.పి. గ్యాస్ ఏజన్సీ వారు డిసెంబరు 7 తేది కొత్త గ్యాస్ కనెక్షన్ల బుకింగ్‌కు దరఖాస్తులు కోరడం, గొడవ జరగడం పాఠకులకు విదితమే. కానీ కొన్ని పత్రికల్లో 18 తేది సర్వోదయ కళాశాలలో బుకింగ్ జరుగుతుందని వచ్చిన వార్తల్లో నిజం లేదని అసలు గ్యాస్ కనెక్షన్ల బుకింగ్‌నే నిరవధికంగా వాయిదా వేసినట్లు హెచ్.పి. గ్యాస్ డీలరు టి. ఇందూధర రెడ్డి తెలియ జేస్తున్నారు.

### పోటీ పరీక్షలకు నెల్లూరులో ఉచితశిక్షణ

పెద్ద పట్టణాలకే పరిమితమై వుండిన పోటీ పరీక్షలకు ఉచిత శిక్షణను జిల్లా కలెక్టర్ నెల్లూరు వాసుల ముంగిటకు తెచ్చారు. ఇకనుండి వివిధ సర్వీసులకు జరిగే పోటీ పరీక్షలకు హాజరయ్యే ఎస్.టి., ఎస్.సి., బి.సి.ల అభ్యర్థులకు శిక్షణ ఇచ్చే ప్రి ఎగ్జామినేషన్ ట్రైనింగ్ సెంటర్ ఏర్పాటయ్యింది. దరఖాస్తు ఫారాలు, అడ్మిషన్‌కు సంబంధించిన ఇతర వివరాలను ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలోని డైరెక్టర్, ప్రి ఎగ్జామినేషన్ ట్రైనింగ్ సెంటర్ నుంచి పొందవచ్చు.

### సాంస్కృతిక పోటీలకు ఎంపికైన కళాకారులు

భారతీయ సంస్కృతి, సమ్మిళితను పెంపొందించేందుకు కేంద్ర ప్రభుత్వ యువజన సర్వీసుల విభాగం సాంస్కృతిక వుత్సవాలు నిర్వహిస్తుంది. ఇందులో భాగంగా 15 నుంచి 35 సంవత్సరాల లోపు వయస్సు గల వారికి వివిధ సాంస్కృతిక అంశాల్లో 13 తేది నుంచి డివిజన్ కేంద్రాల్లో పోటీలు పెట్టి కళాకారులను ఎంపిక చేశారు. వీరి నుంచి కస్తూర్బా క్షేత్రంలో జిల్లా స్థాయిలో నిర్వహించిన పోటీల్లో 30 మంది ఎంపికయ్యారు. వీరిని హైదరాబాదులో రాష్ట్ర స్థాయిలో జరిగే పోటీకి పంపనున్నట్లు నెహ్రూ యువకేంద్రం కో-ఆర్డినేటర్ కె. సుధాకర్ రెడ్డి చెప్పారు. జానపద బృంద నృత్యంలో గూడూరుకు చెందిన 18 మంది కళాకారులతో కూడిన జి. సుబ్బరామ రెడ్డి బృందం ఎంపికయ్యింది. జానపద గేయాలాపనలో ఆర్. దివిజ, సి.ఎస్. ప్రకాశ్, జి.కరుణాకర్, కర్ణాటక సంగీతం ఆర్.కృష్ణమూర్తి, ఎం. లక్ష్మి ప్రసన్న, మృదంగంలో వి.వి.ఆర్. ఫణీంద్ర, వయొలిన్‌లో కె.వెంకట కృష్ణ, వీణావాద్యంలో వి. రాజశేఖర్ రెడ్డి, తబలాలో ఎం. శాంతకుమార్, వీణలో కె.ఎస్. రాజన్, భరత నాట్యంలో ఎ.పి.మైథిలిని ఎంపిక చేశారు. నీటిలో బరువెత్తే లటువంటి వింతలు చేస్తుండిన కపాలీపాలెం యువకుడు అరవదాసు మాత్రం ఈసారి మీసాలతో బరువు నెత్తేందుకు సిద్ధమయ్యాడు. జిల్లాలోని యువతలో వుత్సాహం కల్గించడం ఇదే మొదటిసారి. రాష్ట్ర స్థాయి పోటీలో నెగ్గుకు రావడం కష్టమైనా మనం నిరుత్సాహ పరచకూడదు. బెస్ట్ ఆఫ్ లక్!

## జిల్లా వార్తలు

(5 వ పేజీ కొరవ)

విజయవంత మయ్యింది. జిల్లా వ్యాప్తంగా 400 పాఠశాలలకు చెందిన విద్యార్థులు 571 మోడల్స్ ఈ సందర్భంగా ప్రదర్శించారు. అందరికీ ఆరోగ్యం అనే ప్రధాన అంశంపైన 'ఆరోగ్యం విద్య' 'ఆరోగ్యం ఎలక్ట్రానిక్స్' ఆరోగ్యం పౌష్టికాహారం అనే ఉప అంశాలపైన ప్రదర్శించిన మోడల్స్‌కు బహుమతులు పొందాయి. జన విజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో జరిగిన ఈ సైన్స్‌ఫేర్‌ను జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు 15 తేది ప్రారంభించారు. జిల్లా వ్యాప్తంగా ఆరువేల మందికి పైగా పాఠశాల విద్యార్థిని, విద్యార్థులు అత్యంత వుత్సాహంగా పాల్గొన్నారు. సాయంత్రం పూట నిర్వహించిన సెమినార్లు, సాంస్కృతిక ప్రదర్శనలు పలువురిని ఆకట్టు కొన్నాయి. ముఖ్యంగా శుక్రవారం రాత్రి జిల్లా విద్యాధికారి శ్రీపి. భీమన్న మాంత్రికుడయ్యారు. నాలుకలో త్రిశూలం గుచ్చడం, చేతినుంచి విభూతి తీసి పంచడం, అరచేతిలో కర్పూరం కాల్చి నోటిలో వేసుకోవడం, దూరంగా కాగితాలపై వ్రాసిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం వంటి విద్యలు ప్రదర్శించి ఆశ్చర్య పరిచారు. మూఢ నమ్మకాలను కొంతమంది బడాబాబాలు ఏ విధంగా సొమ్ము చేసుకొంటున్నారో ఆయన ఏకధాటిగా వివరించే సరికి పలువురు విస్తుపోయారు. సృష్టిలో ఏ పదార్థాన్ని సృష్టించలేం. నాశనం చేయలేం అనే సూత్రానికి ఏ బాబా అతీతుడుకాదని చెప్పిన విభూతి, శివలింగాలు, గొలుసులు తెప్పించడం కేవలం ఇంద్రజాలం మాత్రమేనని ప్రజలు గ్రహించాలన్నారు. బహుమతి ప్రదానోత్సవ సభకు మాజీ ఎమ్మెల్యే డాక్టర్ సుందరామిరెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేయగా బాలాజీ గ్రూప్ ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ పి.వి. ప్రసన్నరెడ్డి విజేతలకు బహుమతి ప్రదానం చేశారు.

### రైతు సదస్సులు

సంగం, నెల్లూరు డెల్టా భూముల్లో 95 సంవత్సరం లో రెండోకారు పంటవేసే విషయం చర్చించేందుకు కోవూరు, నెల్లూరుల్లో 28 తేది రైతు సదస్సులు ఏర్పాటు చేస్తున్నట్లు ఇన్‌ఛార్జి కలెక్టర్ సతీష్ చంద్ర చెప్పారు. సంగండెల్టా, కనిగిరి రిజర్వాయరు రైతు సదస్సు 28 తేది 10 గంటలకు కోవూరు రెవిన్యూ కార్యాలయంలోను; నెల్లూరు ఆనకట్ట క్రింద రైతుల సదస్సు సాయంత్రం 3గంటలకు నెల్లూరు రెవిన్యూ కార్యాలయంలోనూ జరుగుతాయని వివరించారు.

### అందుబాటులో లేని రెవిన్యూ వుద్యోగులు!

గత రెండు నెలలుగా రాపూరు మండల ప్రజలకు రెవిన్యూ ఉద్యోగులు అందుబాటులో లేరు. పనుల మీద కార్యాలయాలకు వస్తున్న ప్రజలు ఖాళీ సీట్లు చూసుకొని వెళ్లాల్సి వస్తున్నది. అసెంబ్లీ ఎన్నికల ఏర్పాట్లలో తలమునకలై వున్నారని కార్యాలయానికి కాపలా వుండే అటెండర్ చెబుతుండేవారు. కాని ఎలెక్షన్లు అయిన తరువాత కూడా పలువురు ఎగనామం బాపతులో వున్నట్లు తెలుస్తుంది. బాధ్యతా యుతమైన పదవిలో వుండేవారు ఈ విధంగా ప్రవర్తించడం న్యాయం కాదేమో?

### హాస్టల్ ట్యూటర్స్‌కు జీతాలు లేవు!

రాపూరు సాంఘిక సంక్షేమ శాఖ హాస్టళ్లలో పనిచేసే ట్యూటర్స్‌కు గత ఐదు నెలలుగా జీతాలు చెల్లించనందంతో అల్లాడుతున్నారు. హాస్టళ్లలో విద్యా ప్రమాణాలు పెంచేందుకు 9,10 తరగతులు చదివే విద్యార్థులందరిని ఒక హాస్టల్‌లో వుంచే ఏర్పాటు ప్రభుత్వం చేసింది. వీరికి లెక్కలు, సైన్సు, ఇంగ్లీషు, హిందీ సబ్జెక్టులు బోధించేందుకు నెలకు 300 రూపాయలు గౌరవ పారితోషికంతో కొందరు నిరుద్యోగులను నియమించారు. ఈ విధానం ప్రారంభించిన 89 నుండి ప్రతినెలా జీతాలు చెల్లిస్తూనే వున్నారు. ఎందువల్లో ఈ విద్యా సంవత్సరం ప్రారంభం నుండి వీటిని చెల్లించడం ఆపేశారు. రాష్ట్రంలో మిగిలిన జిల్లాలలో ట్యూటర్లకు నెలకు 500 చెల్లిస్తుండగా మాత్రం జిల్లాలో 300 రూపాయలు ఇవ్వడం వెనుక ఆంతర్యం ఏమిటో అర్థం కావడం లేదు. ఏదిఏమైనా సాంఘిక సంక్షేమ శాఖధికారులు జీతాలు చెల్లించడంలో శ్రద్ధ చూపించ వలసి వుంది.

## జనవాణి

(3వ పేజీ కొరవ)

నేరం. అదిగాక సిటీ సర్వీసుల్లో రెండువైపుల సీట్లు వుండడం వల్ల ప్రయాణీకులు నిలబడను వసరాని పాట్లు పడుతున్నారు. సిటీ సర్వీసుల్లో ఒకే వైపు సీట్లు అమర్చే ప్రయత్నాలు చేస్తే బాగుంటుంది.

నెల్లూరు. -హరి

### మాజీ ముఖ్యమంత్రి మేకపోతు గాంభీర్యం!

ఎన్నికల ఫలితాలు ఇంత తారుమారుగా వుంటాయని అధికారంలోకి రాగల్గిన తెలుగు పార్టీ కూడా వూహించి వుండదు. కాంగ్రెస్ వారి దృష్టిలో రాజకీయానుభవం లేనివాడు, రాష్ట్ర యెల్లలు కూడా తెలియని వాడు, ప్రజలను ఆకర్షించేందుకు ముద్దుల పెళ్ళాన్ని వెంటేసుకొని వచ్చినవాడు మొత్తానికి తనకు ఎదురులేదని చాటాడు. కులమతాల పేరుతో సంఘాన్ని మోసం చేయాలనుకున్నవారికి ఎన్నికల ఫలితాలు చక్కగా గుణపాఠం నేర్పాయి. తిరుగుబాటు నాయకుడు వై.ఎస్. ముందుగా చెప్పినట్లు బంగారు పళ్లెంలోనే ఎన్టీఆర్‌కు అధికారం అప్పజెప్పారు విజయ భాస్కరరెడ్డి. తెలుగు దేశం పార్టీని ఏకైక నాయకుడి పార్టీగా చెప్పే కాంగ్రెస్ నాయకులు పివి నరసింహారావు తర్వాత నాయకుడెవరోనని ఎందుకు తర్కించుకోవలసి ఎందుకొచ్చిందో? చావు తప్పి కన్ను లొట్టబోయినట్లు గెలిచిన కొద్ది స్థానాలు కూడా పార్టీ పరం గాకుండా అభ్యర్థుల సొంత బిరుతో గెల్చినవే! రాష్ట్రస్థాయి ఎన్నికలు కాబట్టి తెలుగుబిడ్డ మాన అభిమానం అన్నా తెలుగు ప్రతిష్ఠవైపే ప్రజలు మొగ్గు చూపారు. పార్లమెంటు ఎన్నికల్లో ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తారనడం సందేహంలేదు. ఎన్నికల కార్యక్రమం ప్రకటించిన నాటి నుండి తానే ముఖ్యమంత్రి కాగలనని విజయభాస్కరరెడ్డి మేకపోతు గాంభీర్యాలు పలికారేగాని రామారావు తనకు రాగలిగిన ఖచ్చితమైన స్థానాలు కూడా వూహించలేని ముఖ్యమంత్రిని మనం కల్గియుండడం మన దౌర్భాగ్యం.

కొచ్చిన్ -ఎన్. రామచంద్రారెడ్డి.

### ఎన్టీఆర్ వయసు మళ్లిన ప్రేమ!

ఎన్టీ రామారావు అధికారం చేపట్టిన మరుసటి దినమే విధులకోసమంటూ ఢిల్లీ వెళ్లారు. పర్యటనలో లక్ష్మిపార్వతి భుజంమీద చెయ్యివేసి సంభాషించడం తగని పని చేశారు. అత్యున్నత వ్యక్తి ముందు ఎన్టీఆర్ తన వయస్సు మళ్లిన ప్రేమ ఒలకబోయడం చూసేవారికి అసహ్యంగా వుంది. రెండు రూపాయల కిలో బియ్యం నినాదం ముందు. సంస్కృతికి ప్రాణమిచ్చే ఆంధ్ర మహిళలు ఎన్టీఆర్ పునర్వివాహానికి ఏవిధంగా మద్దతు తెలిపారో అర్థం కావడంలేదు.

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్.



రాజసింహ చిత్రంలో రాజశేఖర్, రమ్యకృష్ణ

# కాంచన ఏమైంది?

మద్రాసు టి నగర్, గిరిరోడ్‌లో మాజీ రాష్ట్రపతి వి.వి. గారి బంగళా ప్రక్కన చిన్న భవంతిలో అలనాటి నటి కాంచన ఉంటుండేది. ఇప్పుడామె కనిపించడం లేదు. ఆ బంగళా కాంపౌండ్ గోడకు ఆనుకుని ఒక చిన్న కుటీరం వుంది. అందులో కాషాయ వస్త్రాలు ధరించి, ఆంజనేయ స్వామి పటానికి పూలమాల వేస్తున్న కాంచన తల్లి వసుంధరను పలకరిస్తే, "కాంచన గురించి మాకెవ్వరికీ ఏమీ తెలియదు. ఆమె పెళ్ళి చేసుకుందని ఎవరో చెప్తేగాని మాకు తెలియలేదు. దాదాపు అయిదేళ్ళ క్రితం బెంగుళూరులో ఏదో కన్నడ చిత్రం షూటింగ్ అంటూ వెళ్ళింది. మళ్ళీ తిరిగి రాలేదు. ఇప్పుడు ఇంకా బెంగుళూరులోనే వుంటుందో ఏమో. కాని, ఆమె ఎవర్ని పెళ్ళి చేసుకుందో ఏమో, అతనెలా ఉంటాడో తెలియని దుస్థితిలో మేమున్నాం. మేము ఆంధ్రలో గొప్ప జమీందారీ కుటుంబానికి చెందినవాళ్ళం. మా అమ్మాయి ఎయిర్‌హోస్టెస్‌గా పని చేస్తున్నప్పుడు కొందరు రాజకీయ నేత్రలతో, సినిమారంగ ప్రముఖులతో పరిచయ మేర్పడింది. హఠాత్తుగా ఉద్యోగం మానేసి, సినిమా స్టార్

> ఎవర్ని పెళ్ళి చేసుకున్నదో, ఎక్కడున్నదో ఆమె అమ్మకూ తెలియదు; అడిగితే కన్నీరు కార్చిందమె!

అయింది. ఆమెను మేమెవరమూ ఏ ప్రశ్నా అడగ కూడదు. అడిగితే జవాబివ్వదు. మా తాతగారు పురాణం నాగభూషణం మద్రాసు యూనివర్సిటీలో గొప్ప సంస్కృత పండితుడు. ఇంత గొప్ప కులాన్ని భ్రష్టు పట్టించడానికే కాంచన పుట్టినట్లుంది" అంటున్నప్పుడు ఆమె కళ్లు చెమ్మగిల్లాయి.

## ఆదాయపు పన్నుశాఖకు బకాయిలు

ఆదాయపు పన్ను శాఖవారికి జయప్రద రెండు కోట్ల 23 లక్షలు; చిరంజీవి 37.21 లక్షలు; అక్కినేని నాగేశ్వరరావు 15.23 లక్షలు; కమలహాసన్ 12.60 లక్షలు; శ్రీదేవి 52.33 లక్షలు; మాలాశ్రీ 17.29లక్షలు; సిల్క్ స్మిత 13.44 లక్షలు; బకాయి పడ్డట్టు ఇటీవల కేంద్ర ఆర్థిక శాఖ ప్రకటించింది. అమితాబ్ బచ్చన్ 3కోట్ల 20లక్షలు; రాజేష్ ఖన్నా ఒక కోటి రూపాయలు; డింపుల్ ఖన్నా రెండు లక్షలు ఆదాయపు పన్ను చెల్లించాల్సినట్లుగా కూడా ఆ ప్రకటనలో పేర్కొనబడింది.

## సంక్రాంతికి సినిమాలు

వెంకటేశ్ నటించిన "పోకిరి రాజా" జనవరి మొదటి వారంలో; సంక్రాంతికి రాజశేఖర్ "రాజసింహం"; కృష్ణ "అమ్మదొంగా"; శోభన్‌బాబు "అస్త్రమూరెడు ఆకబారెడు"; మమ్ముట్టి "రైల్వేకూలి"; చిత్రాలను విడదల చేయడానికి నిర్మాతలు హడావుడి పడుతున్నారు.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాలపేర్లు

కొన్ని టైటిల్స్ ఆంగ్లంలో ఉండడం గమనార్హం. నేషనల్ ఆర్ట్స్ "ఆంటీ"; నితిష్ ఫిలిమ్స్ "అన్‌ఎంప్లాయ్డ్"; ఎస్.ఎస్ సిని క్రియేషన్స్ "వండర్ లేడీ"; ఫ్రెండ్స్ సిండికేట్ "ది కింగ్"; శ్రీ భువనేశ్వరి ఆర్ట్స్ "ఎమర్జెన్సీ"; శ్రీ సాయిరాఘవేంద్ర ప్రొడక్షన్స్ "వన్ మినిట్" శ్రీ ఆర్.జి.ఆర్. క్రియేషన్స్ "లేబర్"; సాయిరాం ఆర్ట్ ప్రొడక్షన్స్ "కిడ్నాప్"; ఫ్రెండ్ సిండికేట్స్ "హల్లో స్టూడెంట్స్"; జి.ఎస్.కె. ప్రొడక్షన్స్ "వరల్డ్‌ప్రాబ్లం"; మదరిండియా క్రియేషన్స్ "ది రిజల్ట్"; రాజేశ్వరి ఫిలిం ప్రొడక్షన్స్ "లోఫ్ ఇండియా టుడే"; శ్రీ సాయిశక్తి కంబైన్స్ "పోలీస్ స్టోరీ"; "పోలీసదాస"; ఎం.ఆర్.మూవీస్ "రివెంజ్"; మహరాజ్ ఆర్ట్స్ "కర్ఫ్యూ 1994"; కె.ఆర్.ఫిలిమ్స్ "పోలీస్ క్రిమినల్"; రమ్య ఆర్ట్స్ "టాప్ కిల్లర్"; శ్రీ లక్ష్మి శైలజా మూవీస్ "డేరింగ్ హీరో"; శ్రీ షిర్డి సాయి ఫిలిమ్స్ "ఫాలెంట్ రౌడీ"; సాయి కిరణ్ పిక్చర్స్ "డ్రగ్స్ అండ్ ఎయిడ్స్"; సూపర్ గుడ్ ఫిలిమ్స్ "మిస్టర్ రోమియో".

మారుతి సిని మేకర్స్ "ఎంత్రా నువ్వు చేసేది?"; శ్రీ పద్మావతి క్రియేషన్స్ "శ్రీమతిగారి సీమంతం"; శ్రీ ప్రియాంక పిక్చర్స్ "శ్రీమతి చింపాంజీ"; శ్రీ శ్రుతిలయ యూనియడ్ "దాదాగిరి"; విజసాయి మూవీస్ "ఖాకీ పువ్వు"; అను ఆర్ట్ క్రియేషన్స్ "అల్లరి పెళ్ళి కొడుకు"; ఆనంద్ సిని ఆర్ట్స్ "చినబాప్"; శ్రీ విష్ణు పిక్చర్స్ "దేవుళ్లగోల-మానవ లీల";

# ఆడవారిని ఆలోచింపజేసే 'ఆమె'

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

తానే కథ వ్రాసుకొని, దర్శకత్వం వహించి "ఆమె" చిత్రాన్ని సందేశాత్మకంగాను, వినోదాత్మకంగాను రూపొందించాడు ఇ.వి.వి. సత్యనారాయణ. స్త్రీని కేంద్ర బిందువుగా చేసుకుని భిన్న దృక్కోణాల్లో స్త్రీలు ఎదుర్కొనే సమస్యలను చూపుతూ సాగుతుంది ఈ చిత్రం. సమగ్రంగా స్త్రీ సమస్యలను చర్చిస్తుంది. ప్రతి ఇంట్లోనూ ఈనాడు స్త్రీల పరంగా కనిపించే సంఘటనలే ఇందులోనూ వున్నాయి. మగమృగాలను ఎదిరించిన ఒక సబల కథ ఇది.

స్త్రీ జనోద్ధరణ కోసం గతం నుంచి ఆధునికం వరకు ఉద్యమాలు నిర్వహిస్తున్నా, సాహిత్య పరంగా, నాటకాలు, సినిమాల రూపంలో ప్రబోధాలు సాగిస్తున్నా, తల్లిగా, చెల్లిగా, భార్యగా, స్నేహితురాలుగా అనునిత్యమూ పురుషుడికి సేవలందించే స్త్రీ ఇంకా పురుషాధిక్యతకు బలవుతూనే వుంది. ఆధునిక స్త్రీ ఈ విధానాన్ని ఎదిరించాలి. తనకంటూ ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం నిర్వరచుకోవాలి. స్త్రీ పురుషుల మధ్య కావలసింది సత్సంబంధాలేకాని దురహంకారం కాదని, ఎవరు ఎవరికీ బానిస కాకూడదని నిరూపించాలి. స్త్రీ సమస్యలను సజీవంగా చిత్రించి, చైతన్యవంతంగా రూపొందిన "ఆమె" చిత్రం ఇందుకు దోహద పడుతుంది. స్త్రీని పురుషుడినీ ఆలోచింప జేసిసంపూర్ణ మానవులుగా [illegible] రించేందుకు ఇటువంటి [illegible] చాలా అవసరం.

కథ, వివాహబాంధవ్యాలతో ముడిపడ్డ రెండు కుటుంబాల ఆధారంతో నిలబడుతుంది. ఒక కుటుంబం లోభిగా వున్న వ్యక్తి (కోట) ది. రెండవ కుటుంబం నలుగురు ఆడపిల్లల తండ్రి సుబ్రహ్మణ్యం (చంద్రమోహన్)ది.

అతని పెద్దల్లుడు పట్టాభి (తనికెళ్ళ భరణి)ఉద్యోగం ఊడి మామగారింట్లోనే మకాం పెట్టాడు. సుబ్రహ్మణ్యం రెండవ కూతురు ఊహను (కొత్తనటి ఊహ) పిసినారి వ్యక్తి కుమారుడు ఆంజనేయులు (శ్రీకాంత్) పెళ్లి చేసుకుంటాడు. అతను రోడ్డు ప్రమాదంలో మరణిస్తాడు. అతను చేస్తున్న బ్యాంక్ ఉద్యోగం ఊహ కిస్తారు. విధవరాలైన ఊహను విక్రాంత్ (నరేష్) ప్రేమిస్తాడు. అతన్ని వివాహమాడేందుకు ఊహ అంగీకరిస్తుంది. ఇది ఇలా వుండగా ఊహ సంపాదన మీద పట్టాభికి ఆశ కలుగుతుంది. ఒక రోజు బలవంతంగా పట్టాభి ఊహ మెడలో తాళికట్టి ఆమెను తన రెండో భార్యగా ప్రకటించుకుంటాడు. అది ఇష్టం లేని ఆమె మంగళసూత్రం తెంచి పట్టాభి ముఖాన కొట్టుంది. పిసినారి వ్యక్తి కామ దృష్టి ఆమె మీద పడుతుంది. ఆమెను చెరచబోతాడు. అంతా చూస్తూ అంతవరకు అణగి వున్న పిసినారి వ్యక్తి భార్య చెలరేగి కత్తిపీటతో ఆ దుర్మార్గుడ్ని హతమారుస్తుంది. పట్టాభిలో పశ్చాత్తాపం కలుగుతుంది. ఊహ తనకు నచ్చిన విక్రాంత్‌ను వివాహమాడుతుంది.

చిత్రంలో సందేశానికి తోడు దర్శకుడు మంచి వినోదం కూడా గుప్పించాడు. నరేష్, శ్రీకాంత్, బ్రహ్మానందం, ఎ.వి.యస్ కడుపుబ్బ నవ్విస్తారు. నరేష్, ఊహను బస్సుల్లో వెంటాడే దృశ్యాలు ఆహ్లాదకరంగా సాగుతాయి. ఆడపిల్లల తండ్రిగా బరువు బాధ్యతలు గల పాత్రను చంద్రమోహన్ గొప్పగా పోషించాడు. కోట శ్రీనివాసరావు పిసినారి వ్యక్తిగా అతని నటన ప్రత్యేకంగా కనిపిస్తుంది. దుర్మార్గుడుగా తనికెళ్ళ భరణి తన ప్రతిభను వెల్లడించుకున్నాడు. కొత్త నటి ఊహ హీరోయిన్‌గా మంచి నటిగా రాణించింది.

ఇసుకపల్లి మోహన్‌రావు మాటలు బలంగా కుదిరాయి. భువన చంద్ర పాటల్లో 'ఊహల పల్లకిలో' పాట విద్యాసాగర్ సంగీతంలో కమ్మగా వినిపించింది. ఎ. విజయకుమార్ ఫోటోగ్రఫీ దర్శకుని భావాలకు అపురూప సుందర లావణ్యాన్ని సంతరింప జేసుకుంది.

దర్శకుని ప్రతిభా పాటవాలబలం, మాటల బలం, నటీనటుల నటనా బలం, సందేశం, వినోదాల బలం, స్త్రీ శక్తి, వ్యక్తిత్వం విముక్తి బలం యివన్నీ ఈ చిత్రం చూచిన ప్రేక్షకుల హృదయాల్లో బలంగా నాటుక పోతాయి.

# డిసెంబరు 25 ఎందుకు గొప్పది అది నా పుట్టిన దినం కాబట్టి!

నగ్మా తనకు మేకప్ సామానులు అందించడానికి తెలుగు తెలిసిన అమ్మాయిని నియమించుకుం[illegible] "మీరు తెలుగులో మాట్లాడ[illegible] నేర్చుకోవడానికి ఆ అమ్మా[illegible] ఏర్పాటు చేసు[illegible] కున్నా[illegible]" అని అడిగితే, అంతే[illegible] నన్ను ఎవరైనా తెలుగులో తిట్టి[illegible] కూడా నాకు తెలి[illegible]" అంది చిరసంగా నవ్వుతూ. ఆ [illegible]నికి కారణం క్రితం రాత్రి ఆమె ఉపవాసముండడమట. 'ప్రతి గురువారం రాత్రి నేను ఏ ఆహారమూ తీసుకోను. షిర్డీ సాయిబాబా భక్తురాల్ని. అందామె. ఆమె తండ్రి బొంబాయిలో కొన్ని సినిమాలు నిర్మించారట. "డిసెంబర్ 25 ఎలా ప్రసిద్ధి పొందిందో నీకు తెలుసా?" అని ఆమె అసిస్టెంట్‌ను అడిగింది. అసిస్టెంట్ గుర్తు మిటకరిస్తుంటే, "ఆ రోజు నివేదిత పుట్టినరోజు" అంది నగ్మా. నివేదిత ఎవరండోయ్? అని అసిస్టెంట్ అడిగింది. అది నా అసలు పేరు అంది నగ్మా, విరగబడి నవ్వుతూ. ఈమె తల్లిగా రాధిక "విల్లాది విల్లన్" అనే హీరో సత్యరాజ్ దర్శకత్వం వహించే చిత్రంలో నటిస్తోంది.

# పదవి ప్రసన్నదైనా పెత్తనం రమేష్‌దే!

నల్లపరెడ్డి కుటుంబపు రాజకీయ ప్రతినిధిగా, చిన్నవయస్సులోనే మంత్రి పదవి సంపాదించి తమ కుటుంబ ప్రతిష్ఠ పెంచారు శ్రీ నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి. ఆయన రాజకీయ జీవితం నక్క తొమ్మెతొక్కి ప్రారంభమైంది. తండ్రి చాటు బిడ్డగా వుండినవారు; తండ్రి చివరి దశలో పలురకాల వివాదాలకు, అవినీతి ఆరోపణలకు గురైనవారు; శ్రీలక్ష్మి ప్రసన్నమనే నామిడి జనం నోళ్ళపై నానేటట్లు చేసినవారు- తండ్రి మరణంతో కల్గిన సానుభూతి పవనంతో ఒక్కసారిగా మంచిబాలుడై పోయారు. ఆ గాలిలో అతడిపై వున్న ఆరోపణలు, ప్రచారాలు కొట్టుక పోయాయి. ఆరోజు తెలుగు దేశంలో చేరడమూ అదృష్టమే. జనార్ధనరెడ్డి పెద్ద మనసు చేసుకొని వుంటే కాంగ్రెస్ టిక్కెట్ పొంది, ఒక వేళ అప్పుడు గెల్చినా, ఇప్పుడు తుఫానులో కొట్టుకొని పోయివుండేవారు. అతడి అదృష్టం బాగుండి ఆ రోజు జనార్ధనరెడ్డి కాంగ్రెస్ టికెట్ నిరాకరించారు.

తండ్రివలె, పెద్ద తండ్రివలె రాజకీయ పోరాటాలు చేసి, పంచాయితీల స్థాయినుంచి నలిగి పైకెదగవలసిన అవసరం లేకుండా పోయింది ప్రసన్నకుమార్‌రెడ్డికి. వారిద్దరూ వేసిన రాజకీయ పునాదులపైన, చకచకా తన సౌధం కట్టుకున్నాడు. శ్రీనివాసులురెడ్డి కుమారుడు కావడమే ప్రసన్నకుమార్‌రెడ్డికి ఈరోజు మంత్రిత్వం లభించడానికి ప్రధాన కారణం కావడం గమనార్హం.

## జిల్లా తెలుగుదేశంలో ఎన్టీఆర్‌కు సన్నిహితుడిగా రమేష్‌రెడ్డి మాటే చెల్లుబాటౌతుందా?

పదవులకు కొత్త అయినా, ప్రసన్నకుమార్‌రెడ్డి రాజకీయాలకు పాతవారే. తండ్రి వెంట తిరుగుతూ, దగ్గరేవుండి పరిశీలిస్తూ , రాజకీయం బాగానే వంట బట్టించుకున్నారు. అదే మృదుభాషణం, అదే ఓర్పు, అదే నేర్పు అలవడ్డాయి. ఆయన వాక్చాతుర్యం, ఉపన్యాస విన్యాసం ఒంట బట్టక పోవడమొక్కటే కొరత. చిన్న వయస్సులోనే పెద్ద పదవిని పొందిన ప్రసన్నకుమార్ రెడ్డి ఆ పదవిలో రాణించాలని, పదవికి వన్నె తేవాలని జమీన్‌రైతు ఆకాంక్షిస్తున్నది. తన కుటుంబం నుంచి తనకు వారసత్వంగా లభించిన వర్గ బలాన్ని సమన్వయం చేసుకోగల్గితే ప్రసన్న జిల్లా రాజకీయాలలో కీలక పాత్ర వహించే రోజు దగ్గరలోనే వుంది! శీనయ్య లేని లోటును పూరించి ఎన్సి శిక్షణ, మార్గదర్శకత్వం వహిస్తే బాగుంటుంది. ఎన్సి శిక్షణ అంటే అబద్ధాలు చెప్పడంలో మాత్రం కాదండోయ్!

* * *

మంత్రిత్వం పోరులో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చాలా ఆశాభంగాన్ని ఎదుర్కొన్నారు. రమేష్‌రెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు కూడా పదవికోసం తాపత్రయ పడినా, ఆశలేదని తెలగానే వల్లగా తప్పుకున్నారు. చంద్రమోహన్‌రెడ్డి మాత్రం ఆఖరు నిముషం వరకు పోరాడి, అలిసిపోయి, నిరాశతో వెనుదిరిగారు. జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడిగా, పార్టీ అధికారంలో లేని సమయంలో పాదయాత్రల పేరుతోనే, సారా ఉద్యమం సాకుతోనే జిల్లా అంతా తిరిగి, పార్టీని బ్రతికించిన వాడిగా తనకె ఆ అవకాశం రావాలని శతపోరాడు చంద్రమోహన్‌రెడ్డి. ఈ వెంపర్లాటలో ప్రసన్న కుమర్‌రెడ్డితో అనవసరంగా స్పర్థలేర్పడినాయి. రమేష్‌రెడ్డి అనుచరులతో ఘర్షణ జరిగింది. మేనత్త చివాట్లు తినవలసి వచ్చిందంటారు. పదవికి పదవీపోయి, ఈ చిక్కులు మిగలడం చంద్రమోహన్‌రెడ్డికి బ్యాడ్ స్టార్ట్! కానీ ఇటువంటి చిక్కులను అధిగమించే వాకచక్యం, చతురత అతనిలో పుష్కలం; అందువల్ల చింతపడవలసిన పనేమీ లేదు.

మంత్రిత్వం ప్రసన్నకు వచ్చినా, జిల్లాలో పార్టీ పెత్తనం నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ టి.రమేష్‌రెడ్డికి దక్కుతుందన్పిస్తూంది. ఎన్టీరామారావు ఇప్పుడున్న పరిస్థితులలో ఏ ఎమ్మెల్యేనీ గుర్తించి, గౌరవించే అవకాశం లేదు. ఎమ్మెల్యేలకు సిఎం ఇంటర్వ్యూ దొరకడమే గగనమౌతుంది. రమేష్‌రెడ్డికి ఆ బాధలేదు. ఎన్టీఆర్ ఇంటి తలుపులు అతడికోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి. ఏ సమయంలోనైనా ఎన్టీఆర్ దగ్గరకు వెళ్ళి, నేరుగా సంభాషించే చనువు, స్వాతంత్ర్యం కల్గిన రమేష్‌రెడ్డి మాటే చెల్లుబాటు కావడం సహజం. డేగా, ఎన్సి వంటి సీనియర్లు పదవుల్లో లేకపోవడంతో జిల్లా అధికారులూ రమేష్‌రెడ్డి ఛానల్‌లోనే నడవవలసి వచ్చినా ఆశ్చర్యం లేదు.

అయితే అంతటి పెద్దరికం సాధించడానికి, నిలబెట్టుకోవడానికి రమేష్ రెడ్డి చాలా పరిణతి పెంచుకోవలసి వుంటుంది. పిల్ల చేష్టలు, తుంటరి మాటలు, తొందరపాటు ప్రకటనలు విడిచి పెట్టి, పెద్దరికంతో వ్యవహరిస్తే జిల్లా పెత్తనం రమేష్‌రెడ్డికి కష్ట సాధ్యం కాదు. రమేష్ రెడ్డిని అనుసరించి నడవడం తమకు చిన్న తనమని భావించే స్థాయి ఎమ్మెల్యేలు కూడా ఎవరూ లేరు. ఆయనకు కనీసం ఐదేళ్లపాటు మునిసిపల్ చైర్మన్‌గా పనిచేసిన సీనియారిటీ వుంది; తక్కినవారికి అదీలేదు.

రమేష్‌రెడ్డి వ్యక్తిగతంగా చెడ్డపేరున్నవాడుకాడు. అవినీతి ముద్రలేదు. ఎన్టీఆర్ అధికారంలో

## ఎమ్మెల్యేలలో ఎవర్నీ ఎవరూ నాయకుడిగా గౌరవించే పరిస్థితి లేదు; సోమిరెడ్డి మంత్రిత్వపు ప్రయత్నంలో చికాకులు తెచ్చుకున్నాడు.

వున్నన్ని రోజులూ వెలుగులో వుండినా, వుండడానికి ఇల్లు, తినడానికి జీవనాధారం సంపాదించుకోలేని స్థితిలో ఈ ఐదేళ్లకాలం గడిపాడు. అందువల్ల ప్రజలూ రమేష్‌రెడ్డిని నాయకుడిగా స్వీకరించడానికి సందేహించక పోవచ్చు. అతనికి మంచి అవకాశం వచ్చింది; కావలసిందల్లా దాన్ని వుపయోగ పెట్టుకోగల అర్హతలు సమకూర్చుకోవడం.





## పులివెందుల మున్సిఫ్ వారి కోర్టులో

O.S. 159/94

స్టేట్ బ్యాంక్ ఆఫ ఇండియా,
పులివెందుల -వాది

బరుగు జాన S/o. మార్క్,
తొండవగండ్ల, తొండూరు మండలం
ప్రతివాది.

పై దావాలో ప్రతివాదికి దావా నోటీసు నిమిత్తమై వాయిదా 30-12-94 తేదిన ఉన్నది. ఆక్షేపణలున్న తెలుపు కోవచ్చును.

-G. ప్రభాకర శాస్త్రి , అడ్వకేటు,
పులివెందుల.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,